# గాంధి మహాభారత రత్నములు.



గ్రంథకర్త:

సద్బ్రహ్మశ్రీ దుగ్గిరాల రాఘవచంద్రయ్య సచ్ఛాస్త్రి.

# గాంధిమహాభారత రత్నములు.



వేదవ్యాసమహర్షి చెప్పినదియు,

సద్బ్రహ్మశ్రీ
దుగ్గిరాల రాఘవచంద్రయ్య సచ్ఛాస్త్రి
అనువదించినదియును.

"గీ॥ బ్రాహ్మణత్వమ్ము లోకమ్ము వారికెల్ల
విషమువోయు బ్రహ్మాండమౌ విసపుచెట్టు
కాలకూట మద్యానిచే గలుగు మేలు
లేదు సర్వమ్ము కీడె ఫలించుచుండు."

మొదటికూర్పు 500

ప్రకాశకులు:—సద్బ్రాహ్మణాశ్రమము, బెజవాడ.

ముద్రాపకులు:—
రాధాకృష్ణ అండు కో., ముద్రాశాల, బెజవాడ.

1934.



వెల రు 0-10-0.
అట్టబైండు రు 0-12-0.

# పీఠిక

వేదవ్యాసమహర్షి దయతో ప్రబోధించినదియు, ఆంధ్రమున గద్యపద్యాత్మకముగ నేనురచించినదియు అగు "గాంధిమహాభారతము"లోని వేలకొలది పద్యముల నుండి ఈ చిన్నపొత్తమును "గాంధి మహాభారత రత్నములు" అను పేరుతో "సద్బ్రాహ్మణ మతము"ను కొంతకు గొంత తెలియఁగోరువారి యుపయోగార్థము ప్రచురించితిని.

అష్టాదశ మహాపాపములతో నిండి భ్రష్టమైన నేటి బ్రాహ్మణ మతమును పవిత్రీకరించి సద్బ్రాహ్మణ మతముగా చేయుట అవసరమని హిమాలయము నుండి కన్యాకుమారి వఱకుగల సద్బ్రాహ్మణులు ఏకగ్రీవముగా అంగీకరించుచునే యున్నారు. సద్బ్రాహ్మణశ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు నేనురచించిన "అష్టాదశ మహాపాపి యగు బ్రాహ్మణునితో సాహాయ్యనిరాకరణము ఒనర్చుము" అను గ్రంథమునందు ఆవిషయముంగూర్చి చెప్పియేయున్నారు. వేదానుగుణమగు సద్బ్రాహ్మణ మతమును బ్రాహ్మణులు ఒప్పుకొని పూనినచో భరతఖండము మరల ప్రపంచ దేశములలో అగ్రస్థానమువహింపక తప్పదు. బ్రాహ్మణ మతముచే గలిగిన అంతఃకలహములు తొలఁగి, ఏకజాతీయత ఏర్పడి, పోయినస్వరాజ్యము మరల త్వరలోసిద్ధించితీరును.

గ్రంథమునందు సులభముగా అర్థమగుటకొరకు సంధి సర్వత్ర విడిచితిని. ప్రమాదవశమున అనేకదోషములు దొరలినవి. విద్వాంసులు మన్నించి గుణముం గ్రహింతురు గాక!

త్వరలో "గాంధ్ర మహాభారతము"ను ఖండఖండములుగా ప్రకటింప నెంచితిని. భాషాపోషకులు దయతో ప్రోత్సహింతురుగాత.

సద్బ్రాహ్మణాశ్రమము
బెజవాడ
20—6—1934

దుగ్గిరాల రాఘవచంద్రయ్య
సచ్ఛాస్త్రి

# నల్లనికుక్క తెల్లనగునా?

ఉ॥ నల్లనికుక్క తెల్లనగునా? యనిపల్కెను బ్రాహ్మణుండిదే
మల్లరి! శాంతి! శాంతి! యిదియంతయు కిల్బిషశూద్రు లెప్పుడున్
నల్లని కుక్క కాదు; మఱి నర్మిలి బాపన కాంత కోరగా
పిల్లలనీయఁజాలవొకొ? పిచ్చలుపల్కకుడయ్య బ్రాహ్మణుల్!

ఉ॥ నల్లనికుక్కఁగాను జుమి! నాకు మహేశ్వరుడిచ్చు జన్మమే
నల్లని కుక్కయైన మఱి నల్లనికుక్కవు నీవుకావొ! నీ
నల్లనిపుత్రియున్ మఱియు నల్లనిపుత్రుడు "నల్లకుక్కలే"
నల్లనికుక్కలంచు పగనాడకు పూజ్యులఁ బిచ్చిబాపఁడా!

ఉ॥ నల్లని కుక్క "గానుజుమి" న్యాయముకానిటులంట శూద్రులన్
తెల్లని బాపనమ్మలు మతిన్ వరియింపరె? పెండ్లియాడరే?
నల్లని కుక్కలేనియు మనంబుల గోరరు సంతుకల్గమన్
నల్లనికుక్క తెల్లనగునా? యని బల్కఁగఁబోకు; బాపఁడా!

ఉ॥ జందెముందిట్టె బ్రాహ్మణుడు సర్వమెఱింగియుందానుమేన ఆ
జందెము తాల్చియుండియును; జందెమునే ధరియింపఁ
దప్పా! యీ

చందము కల్గునే జగతి? సజ్జనులోర్తురె? యెందు ధర్మవుల్
పొందిక యెట్లు సేయుదువు? భూసుర నామము నీకుఁ జెల్లునే?

ఉ॥ సంధ్యయొనర్తువేల? యని సారెకు నన్నని ప్రశ్న వేయుఁ; దా
సంధ్యయొనర్చు బ్రాహ్మణుడు; సత్యపరత్వ మెయిద్ది! అక్కటా!
సాధ్యయు అన్యబిడ్డల శుభమ్ములకున్ మురిపెమ్ముఁ గాంచు; నా
సంధ్యకు బాపడిట్టులు విచారము కాంచుట ధర్మమౌనొకో!

# గాంధి భారతమునుండి

చ॥ చదివితి గీత; నేఁజదివి సారమెఱింగితి; నైత్తిరీయమున్
జదివితి; కొంత వేదముల సారమెఱింగితి; నెందు వేదముల్
చదువుట మానవావళికి సత్య విరుద్ధమటన్న మాట నేఁ
జదువను; రాక్షసత్వమిటు జంకక తాల్చెద రేల బ్రాహ్మణుల్!

సీ॥ స్వాధ్యాయ మొనరింతు స్వాధ్యాయమీవు కా
వింపఁ బోలదనుట వేదమతమె?
ప్రవచనమ్మొనరింతు ప్రవచనమ్మీవు కా
వింపఁ బోలదనుట వేదమతమె?
యజనమ్ము కావింతు యజనమ్ము నీవు కా
వింపఁ బోలదనుట వేదమతమె?
యాజనమ్మొనరింతు యాజనమ్మీవు కా
వింపఁ బోలదనుట వేదమతమె?
దానమున్ బ్రతిగ్రహణంబు ధర్మమగును
నాకు; మఱి యధర్మంబగు నీకు ననుట
వేదమే మానె? రాక్షసవాదమూని
అకట! బాపడ! రక్కసివైతి వేల?

సీ॥ కుష్ఠువగానచ్చు జంతువుగొనక విందులు
తురకలగూడు సాధ్వులను జేరి
హత్యలు కావించునట్టివారలగూడి
ఏకపంక్తి భుజించు టెగ్గు కాదు
బాపనిమాటున బాపనమ్మకుమాల
చేబుట్టినేనియు చేటులేదు
పంక్తిలో భుజియింప బాపనులే వారు
బ్రాహ్మణునింటను భవముగనుట!

అకట! సర్వజ్ఞుడైన సత్యస్వరూపి
యైన బాపలపోషించునట్టిదైన
శూద్రుడనువాడు మీ విందుచూడ రాదు!
బాపడా! చూడు మీ వెంత పాపమతివో!

సీ॥ అగ్రహారములిచ్చి యర్చించురాజైన
సంతర్పణాలుసేయు సత్పురుషుడు
సర్వశాస్త్రజ్ఞుండు సత్యవంతుడునైన
శూద్రుడు మీవిందుచూడరాదు
బాపనింటను శూద్రభర్తకుజన్మించి
గుసగుసల ద్విజుడై కులుకువాడు
ఘోరహత్యలు మఱి వీరహత్యలు బ్రహ్మ
హత్యలుచేసిన యట్టివాడు

నైన బాపడకా పేరది యందునేని
బ్రాహ్మణుల పంక్తిని భుజింప బాధలేదు!

బ్రాహ్మణావళి ధర్మమీపాటిదయ్యె!
ఎంతరాక్షసధర్మమో యిది తలంప!

# చండాలు రెవరు?



సీ॥ బాపనకాంతకు భర్తయై శూద్రుండు
సంతానముంగాంచు నంతమాత్రి
పుట్టిన సంతానములు శాశ్వతమ్ముగా
చండాలతంబొంది సంఘబాహ్యు
లుగ గ్రామబాహ్యులు లోకబాహ్యులు నయి
బ్రాహ్మణత్వము నెందవలనుపడక
యట్ల యాచంద్ర తారార్కముందురు; వేలు
భవమునగవారికి బ్రాహ్మణత్వ

మీశుడీవచ్చు; వేదజ్ఞులేని వార
లీపుడమిని బ్రాహ్మణత వహింపరాద
టంచు దుష్టశాసనము బ్రాహ్మణుడ! యెట్లు
వ్రాయగల్గితి! వేదమ్ము భంగపరచి!

సీ॥ బాపండు శూద్రకు భర్తయై పడయు సం
తానమ్ము చండాలతంబడయ ద
టంచుం జెప్పుదు; మఱియా నోటనే బ్రాహ్మ
ణికిని శూద్రునకు జనించువాడు

చం...లుకొంచును చాటుట ధర్మమే
దుష్ట శాస్త్రమ్ములు తోడుగొనుచు?
వేదమ్ము లందేమి విధియించెం దానిట్టు
లీశుండు? మర్త్యభాష్య మీవు వ్రాసి
నంతనే వేదవాక్కులయందుం గల్గు
సత్యమదిమాసిపోవునే! – జ్ఞానముడిగి
పదియు నెన్మిది పాపాల భ్రష్టుడవయి
సిగ్గువిడిచి కావించిన చేతకాక?

ఉ॥ బాపనకాంతకున్ మఱియు బాపనయయ్యకు భేదమొంచి
యీ
వీపగిదిన్ సచింపుటకు నీశ్వరుడొప్పునె? వేదవాక్కులన్
బాపరికమ్ములేక తనుతత్త్వము చెప్పంగలేదె! ఎందునన్
స్త్రీపురుషుల్ విభేదమగురీతులనుండురటంచుం జెప్పెనే?

ఉ॥ పంచముడన్ను డీకనిది పాపపుజన్మయటంచుజెప్పి కా
వించెనె వేఱుగా తనువు? విప్రుడవంచును నీకు వేఱుసే
యించెనెదేహతత్త్వము? విధించెనెకొండొకతీరు స్త్రీలకున్!
వంచనచేసి లోకములు పాపపువాతలు వ్రాసినావెటికిన్?

ఉ॥ గీతల "* బాపయోని" యని కేలిడిచూపగలేదె నిన్ను! నా
గీతిక శూద్రభర్తలను గ్రిడలం దేర్చి యపారసంతతిన్ ..

---

* మాంహిపార్థ వ్యపాశ్రిత్య
యేపి స్యుః పాపయోనయః

జాత్తురతగా గడించుకొనంజాలిన బాపనస్త్రీలబిడ్డలగా
గోతువె! గొంతు? పాపములకుఁగా బదియెన్మిదికిన్ని బిడ్డవె?

సీ॥ మానవావళికెల్ల మాన్యయజుర్వేద
మేశిరమంచు వచింపలేదె?
ఋగ్వేదము జనులకెల్లరకినగు ద
క్షిణపక్షమంచు వచింపలేదె!
సామవేదమ్మది సర్వజనులకు ను
త్తరపక్షమని యథర్వవేద

---

స్త్రియో వైశ్యా స్తథాశూద్రా
స్తేపియాంతి పరాంగతిం॥

అను గీతాశ్లోకమునందు "పాపయోనయః" అనుపదమును భగవంతుడగు శ్రీకృష్ణుడు అష్టాదశమహాపాపులగు బ్రాహ్మణులనుద్దేశించి చెప్పగా వర్ణాశ్రమవాదులును, నేటి సనాతనులును, చండాలురు అను పంచములను వారికి అశుభము జెందునట్లుగామార్చి అర్థము చెప్పుట ధర్మముకాదు. త్రికాలజ్ఞుడగు భగవంతుడు బ్రాహ్మణులు అష్టాదశ మహాపాపులగుదురని యెఱిగి వారికిగూడ మోక్షముకలదా? యను శంకరాగా "పా ప యో న యః" అనగా 18 మహాపాపములతే పుట్టుకగాకలవారు (అనగా అష్టాదశ మహాపాపులకు జన్మించి జన్మమునుండి 18 మహాపాపములుచేయుట నగ్గుపాలతో నేర్చుకొనిఆచరించువారు) భగవంతుని ఆశ్రయించుచో మోక్షము నెందుదురు అనిచెప్పి ఆశంకను నివారించెను.

మది * పుచ్ఛమని పరమాత్మ యెల్లరికని
ఏకోక్తిగాగ వచింపలేదె?

తా త్రిరీయంబునందు? భేదంబుస్త్రీల
కేని వర్ణంబులకునేని యితరజనుల
కేని లవమేని బమ్మ సృజించెనో కో!
ఏల హెచ్చు తగ్గులుపొనరింతువీవు?

ఉ॥ భేదముత్తైత్తిరీయమున విశ్వవిరాట్పురుషుండుచేయకే
నాదగుసంతె యెల్లరు జనమ్ములనంచు వచించినాలుగా
వేదములన్ మనష్యులను బీత్రిరచించిలినంచుఁ జెప్పదు
వాదముబూని శూద్రుడని పంచముడంచని చెప్పజెల్లునే!

ఉ॥ స్త్రీలకుఁ బూరుషావళికిఁ జెప్పనెభేదము? దేహమొండు కా
దే? లలనల్ కుమారులును నెందును నొక్కటియైనగర్భపుఁ
జూలయిజన్మమందరొకో! చోద్యపువ్రాతలువ్రాసి దేశముం
జెలిచిపాటుకూటికయి ఛీ! యిటుసేయఁగనౌనె బాపడా!

సీ॥ బ్రాహ్మణస్త్రీలకు బ్రాహ్మణపురుషుల
కంటె శూద్రులయందె కాంక్షహెచ్చి
ఆనందముండియు ఆరుకోట్ల జనుల
చండాలురనియెడి జాతివారి
కనఁబాలునంతకుఁ గలిసి రక్తమున
బ్రాహ్మణపురుషుల వలనగన్న

---

* నాభికి దిగువనున్న భాగమును పుచ్ఛము అందురు.

సంతానమునకంటె చండాల సంతతి
పదిరెట్లు హెచ్చయి ప్రబలెననుచు
నీవు చండాలవాదంబె నిర్ణయించు
ఎఱిగి ఎఱిగి నీసుతలు కావించినట్టి
ధర్మకార్యంబు ఖండింపఁదగు నెనీకు?
ఇట్టియాచారమునఁ ద్రోయు టెట్లు చెపుమ!

సీ॥ కన్నబిడ్డలిటు లక్షలకొలదిగఁ జేయు
ధర్మువు తప్పని చెప్పఁగలవె?
నిర్ణయించితివిపో! నీతివిడిచినీవు
పుత్రికలకు నెట్లొ పుట్టినట్టి
పాపమెఱుంగని పసిబిడ్డలను బిట్టు
కసిబూని ప్రళయమ్ము గల్గునటుకు
గ్రామబాహ్యులనుచు కనరానివారని
అంటగూడని వారలనుచునిట్టు

ఆ॥ గీ॥ వెలియొనర్తువే? దుర్మతీ! బిడ్డలేమి
పాపమొనరించినారలు! పాపివీవు
కాకవారలౌమరె? యిట్టికఠినమతిని
బ్రాహ్మణుండనఁ జెల్లునే! పాపి! చెపుమా!

ఉ॥ బాపలలోనరుంధతికి బాపడుకానివసిష్ఠుడన్న యా
బాపనికిన్ జనింపరొకొ బాపలు? వారు వసిష్ఠగోత్రులం
చేపగిదిన్ భజించెదవొ! యించుకభేదములేక బంధుతన్
జూపుదొ! ఇచ్చిపుచ్చుకొనుచుందువొ! చెప్పుమునీవు బాపడా!

సీ॥ దోసంబుకావించు దుహితల శిక్షింపఁ
జాలక లవముదోషంబులేని
నీదుసాహిత్రుల నీచుండవై ప్రీతి
యాంతమ్మువలకు నంత్యజులటంచు
అంటఁగూడని వారలంచును చూడఁగా
రానివారంచు దుర్నయముతోడ
ఘోరమగా శిక్షనుగూరిచి వేదంబు
లందలిధర్మంబు మ్రింద జేసి
దుష్టశాస్త్రముల్ రచియించిద్రోహ మీసు
నకును మానవునకుజేసి యకట అదియె
ధర్మమని సత్యమని సనాతనమనియును
జెప్పబూనితె! బాపఁడా! సిగ్గువిడిచి!

ఉ॥ ఆలిదియంత్యజాతియట యాబిడభర్తవసిష్ఠుడెంచగా
బోలనితండ్రి బిడ్డయట! భోగపుసాంతకుఁ బుట్టెనంట! చం
డాలతనిట్లు బ్రాహ్మణజనంబులు తారలువొంది బీజ చం
డాలతగాంచి యంత్యజుల నందగునే పెఱవారిఁ బూజ్యులౌ

సీ॥ ఆగుకోట్లకొలదియైన సాహిత్రులఁ
గన్నపుత్రికలను కాదటంచు
ఆరువదిలక్షలే యాత్మీయులంచును
బ్రాహ్మణపుత్రులె భవ్యులనుచు

ధర్మంబు నెఱిగి విద్యావతులై విచ
క్షణతోడ సలిపినట్టి
సంబంధమును దెగింప సాహసించుదె? నీవు
దుహితలుకోరు బంధుత్వమకట!
తెగించి సంఘపు మైక్యత దుంచిజాతి
నెల్లను చీలికల్సేసి నశింపజేయ
జెల్లునే? నీమనుమలను హింసించుటుడిగి
హరిజనులటంచు ప్రేమమై నరయుమయ్య!

ఉ॥ నాలుగు వేదముల్ గొని జనమ్ముల సృష్టియొనర్పబమ్మ దా
చూలున పంచముండనుచు శూద్రుడటంచును జెప్పి వేదముల్
నాలుగు నేర్వరాదనుట న్యాయమె? వేదములంబఠించుచో
చాలడె విప్రధర్మమది సల్పుట? కేలయు సత్యమాడెదో?

మ॥ అనులోమంబు విలోమమంచెచట వేదాళుల్ ప్రశంసించె? నె
వ్వని యాజ్ఞన్ గొని దుష్టభాష్యములు చెప్ప న్నేర్చితో!
గీతలో
కనుగొనేర్చితె? ఇట్టిసూత్రమును లోకధ్వంసివాచుణ మహే
శుని యంగీకృతినందకే పలుకుదే! శోషిల్లవే లోకముల్?

చ॥ కొలదిత్వదీయమౌజనము; కోట్లకొలందిగనుంద్రు
పంచముల్;
సలుపుము చర్చధర్మమది సమ్మతిపొందగ; నెట్లు నీసుతల్

తెలిసిఁ పూజ్యరాంధ్రకట! ధీరులుకాదనుదారిఁద్రొక్కి వి
చ్చలవిడి నాగుకోటలగు సంతతిఁగాంతురు ధర్మదూరతన్?

సీ॥ ఆచారమందువా? ఆరుకోట్లజనులఁ
గన్నమార్గము తప్పకాఁగలదొకో?
ధర్మమ్ముఁ దలఁతువా? ధరణివిచక్షణ
తెలిసిన వ్రుత్రికల్ తీయుదారి
కాదనివారలుకన్న సంతానమ్ము
ధర్మహీనమని యధర్మరీతిఁ
బల్కనేస్తువె? యిట్టి పాపకార్యమ్మది
లోకమ్ములోనిందుగాక యెందుఁ

గలదు? తల్లిదండ్రులు కోరి సలుపుచెల్మి
కొఱకు సృష్టియొంటెము గాంచువఱకు సుతుల
దండనల్ సేయుపద్ధతి తగునె నీకు?
పాపమిది ధర్మమెట్లగు బ్రాహ్మణుండ!

సీ॥ అన్నమయంబగునట్టి కోశమ్మది
చండాలునకు నీకు సమతనొప్పు
ప్రాణమయమ్మౌచు పరగుకోశమ్మది
చండాలునకు నీకు సమతనొప్పు
మానసికమ్మౌచు మసలు కోశమ్మది
చండాలునకు నీకు సమతనొప్పు

విజ్ఞానమయమౌచు వెలయుకోశమ్మది
చండాలునకు నీకు సమతనొప్ప

అవలనానందమయ కోశమందు నేని
భేదముండదటంచుఁ జెప్పగద ఈశు?
డేల చండాలుఁడని పూజ్యు నీసడింతు?
నీదు గాహితుఁడనుచు గణింపవేదె!

సీ॥ వేదమ్ములొప్పని భేదమ్ముకావించి
హెచ్చుతగ్గులుపొనరించుటొకటి
క్షత్రియుల్ బాపలకంటెను తక్కువ
యంచును దెగి నిర్ణయించుటొకటి
వైశ్యులు ద్విజులలోపల కొద్దివారంచు
వ్రాయఁగూడని వ్రాతవ్రాయుటొకటి
శూద్రుండు తక్కువ చూలువాడాతండు
ద్విజధర్మమందగా దెలివులేద

టంచు పల్కుటొకటితప్పు లధికతయును
నీచతయు వర్ణములయందు నిల్పుసరణి
నొప్పెనే వేదములు? చూపుమొక్క సూక్తి
ఈశ్వరుండు స్పష్టత వచియించెనేని!

ఉ॥ వేదములొప్పజాలని వివేకముమాలిన యర్థమొప్ప దు
ర్వాదము భాష్యనామమున వ్రాసి నృపావళియాశ్రి
యమ్ము వే
కావనరుండ దేశములఁ గాలిచి జేసి వివాహపద్ధతిన్
భేదముఁజొన్పి వర్ణములు భిన్నము చేసితి వింత చెల్లునే?

ఉ॥ బాపనునాల్గువర్ణముల వారి కుమారికలన్ గ్రహింపగా
నోపున కాని తక్కొరుల కొక్కని కేనియు బ్రాహ్మణాంగనన్
జేపటొప్పదంచును వచించి నిజమ్మనినమ్మఁ జేసియా
పాపపుసూత్రముల్ జగతిఁ బర్వగ జేసిన సద్విసత్యమే?

ఉ॥ వేదములొప్ప వివిధపు వీటిడివ్రాతలు; గీతలేనియా
వాదమునొప్పఁజాలదు; వివాదము పెంపకుమింక నీసుతన్
భేదములేక వర్ణములు పెండిలియాడగవచ్చు; నీమృషా
వాదము వేదదూరమగు పద్ధతికావున మ్రింగెఁబూర్వమే!

సీ॥ బీజచండాలత వెలయునీయందు యి
వ్విధము నెఱుగలేక వ్రేలిడినగుచు
నీవు దౌహిత్రుల నిర్ణయించితివి 'చం
డాలురంచు దెగిదుర్న్యయముమీర
సత్య మెఱిఁగి ధర్మశాస్త్రంబు సవరించి
వేదహితంబు కావించి యనల

ధర్మ వెఱింగి శూద్రపతులవలన సం
తానంబుకన్న సుతల పనువును
గీ॥ నిల్పిచండాల వాదంబునిల్పి పదియు
నెన్మిది కలుషముల్ విసర్జించి వేద
విహిత సద్బ్రాహ్మణ సరణి వెడలుమయ్య!
బాపడా! దురాచారముల్ పారద్రోలి.

సీ॥ శూద్రను శూద్రుండు సురుచిరరీతిఁ బెం
డిలియైన శూద్రుండు కలుగునంచుఁ
జెప్ప బ్రాహ్మణిఁగూడ సిద్ధించు పుత్రుండు
చండాలుఁడౌనంచు సాహసమున
బలికితివికద యేవలన చండాలత
వచ్చెనీదగు పుత్రవలన గాక
నీపుత్రియందేది నిర్ణయించితి వద్ది
నీయందులే దన నేర్తువెట్లు?
స్త్రీపురుష దేహములను వర్తించు భేద
మనుట వేదవిరుద్ధమౌ ననుటెఱింగి
పుత్రియొకతె చండాలత్వమునకు హేతు
వనుట తప్పుకాదోకొ బ్రాహ్మణుడ! చెపుమ!

చం॥ నిపురించు ధర్మమిది నీకెచలామణి యౌనటన్న యా
భావము సత్యమౌనుగద? పంచములంత్యజులన్న సూత్రముల్

నీవెకదా రచించితివి? నీసుత శూద్రునిచే నదర్శనీ
యావళిఁగాంచుటద్ది తమయాత్మజయాటనె కల్లలేదొకో?

సీ॥ చండాల సిద్ధాంత సరణియెల్లను నీవ
యూహించి చర్చించి యొప్పినావు
పిదప వర్ణములోని పెద్దలొప్పిరికద?
యట్టి నీకులధర్మమరయనీకు
చెల్లవలయునంట కల్లకానుగద? యీ
సిద్ధాంతమొకద నీ స్త్రీలు తాము
శూద్రవరులఁగూడి చూవె చండాలురఁ
బడయుదురంచును బల్కు? నిద్ది
గీ॥ శూద్రులొప్పరు వారలీ సూత్రమెఱుఁగ
రట్టిదా శూద్రసంతతి కన్యయింప
దనుట తథ్యము, చండాలతను భరింప
నీవమిగిలితివిది సత్యనిర్ణయమ్ము.

సీ॥ శూద్రసంస్కర్తతె స్ఫుటమగు చండాల
తయుది నీపురుషుల దనరునంచు
బీజమై సమయమ్ము వేచి నీయందును
నీసుతలందెల్ల నిలిచియుండు
ననుచు నొప్పుకొనుట యగుసత్యమార్గమ్ము
దాని నొప్పదవేని తథ్యమవల

బీజచండాలుడవై జగమ్మునను చం
డాల సిద్ధాంతమ్ము డాకొలిపిన
ధన్యమూర్తివటన్న సిద్ధాంతమీవ
తెలిసి యొప్పెదుకద! అది తెలియు వెనుక
చేయందగు మార్గమింకను జెప్ప నేల?
తప్పుదిద్దుకొనుటయు మేలుదారికాదె?

శా॥ నీలోఁగల్గినయట్టి వస్తువది సంధింపంగ గాహితుండవై
బాలత్వమ్మునఁనొప్పు సజ్జనులు ద్వేషక్రాంతిలోఁ గూలి చం
డాలత్వమ్మునుబొందిరాహరిజనుల్ న్యాయమ్ములోనెంచి చం
డాలత్వమ్ము తొలంచి నీమనుమలన్ లాలింపగాఁజెల్లదే!

ఉ॥ జాలముచేయరాదిది అసత్యపువాదము త్రుంపుమయ్య! చం
డాలత భూమిలోఁగల జనమ్ముల నెందునులేనియట్టి చం
డాలపు భావ! మిద్దికొనినాశముచేసితి! పూజ్యసంతతిన్
బోలిచెలోకమీవిధము; ముప్పగు నింకనువామలాడినన్.

ఉ॥ తప్పులుసేయుటల్ కలుగు తథ్యముమానవ జాతికెందు; నే
విప్పటికేని సత్యము గణింపుము; పాపిజనుల్ వచించు నీ
యొప్పుగ్రహించి దిద్దుకొని యూరకమన్నుమఁ జీల్చినట్టియా
ముప్పను దిద్దుకొమ్ము మఱి పూజ్యతిగాంచుము సత్యపద్ధతిన్.

సీ॥ సత్యమ్ము నిలుపగా జాలితి వనుకీర్తి
పొందనేరుతు వెల్లభూమియందు

నీసుతలకు మున్ను నీయొనర్చిన యెగ్గు
హరియించు; జండాలు రనెడువారు
కన్గరు పుడమిలో కరముదాహితుర్లు
మోదమ్మునందేలి బుజ్జగింతురి
నిన్ను; దేశంబునందున్న భేదమ్ములు
తరలిపో నైకమత్యంబు హెచ్చు
నీవు బీజచండాలత నిలువబోకు;
దేవతలు మెచ్చుదురు భూమిదేవుడవని;
కోరి సద్బ్రాహ్మణత యందుకొంటివనుచు
దేశమాతయు నాశీర్వదించు నిన్ను!

# శూద్రు లెవరు?



ఉ॥ శూద్రుడనంగ నెవ్వఁడో సుంతయెఱుంగక బ్రాహ్మణుండ! నీ
శూద్రుడవంచు దిట్టెదవు! శూద్రుడవై జనియింపవో? నీ
శూద్రత యజ్ఞసూత్రమునఁ జూవెనశించెడు; నింత వేదముల్
భద్రముగాగ జెప్పనిటువల్కెదె! సత్యమెఱుంగరాదొకో?

ఉ॥ సత్యము నేను జెప్పవినిసాహసరీతి హసించుదేల? చూడుమీ
సత్యము నీవయొప్పెదవు జందెముతొల్పని నాటి నీస్థితిన్

వ్యాఖ్యయమింత లేక కనమావల సర్వము గోచరించునా
ధత్యము చూపుకంటెను ఋశిమ్ముగ్రహించుట ధర్మ
నయ్యెడున్

సీ॥ ద్విజుడని లోకముల్ విలుతురుగదనిన్ను
దానియర్థమ్మును దలచినావె?
రెండుజన్మముల నరుండనుట కదాద్వి
జుడను పదమునకు సూరివరులు
శాసించుటేక! ద్విజత్వమ్ము కొనక పూ
ర్వము నీకుగల జన్మ ప్రథమమెకద?
అది ద్విజేతర జన్మమంచు నీవును నొప్ప
కొందువుగద? యింక కొసరవేల

గీ॥ వర్ణజన్మల్లు నాల్గని వ్రాయలేదె
బన్ను? అందు మూడు ద్విజజన్మమ్ము లండ్రు;
మఱి ద్విజేతరమయిన జన్మమ్ము శూద్రు
నయుకదా? యింత తెలియనో! తర్కమేల?

చం॥ "ద్విజుడను జన్మచే"నన ట ధీరులు మెచ్చని సూత్రి
మానను "నా
ద్విజత జనించునప్పుడది వెంబడివచ్చె"నటంచుఁ జెప్పుచో
త్రిజగాయ యజ్ఞసూత్రమున దేటపడున్మఱి అట్టివాదముల్
ద్విజులు సహింపఁజాలరిది తెల్లము నేవచియింప నేటికిన్?

ఉ॥ కావున నీవుపుట్టువది కాదు ద్విజత్వము; శూద్రజన్మతో
ఈవు జనించితన్న నుడియెంతయు నొప్పెడి ధర్మనిర్ణయం
బావిధమెట్టులన్న బరమాత్మ రచించిన నాల్గువర్ణముల్
భావనచేయ శూద్రతిచెలంగెడు నొక్కడ ఏక జన్మతన్

ఉ॥ తక్కుగలట్టి జన్మములు తథ్యముచూవె ద్విజేతరమ్ము; లం
దొక్కటి కేని జన్మమది యొక్కడు కాదు; ద్విజన్మలొప్పు; ఈ
షక్కియెఱింగినన్ ద్విజుడ! ప్రాథమికమ్మగు నీదుజన్మమే
చక్కని బ్రాహ్మణత్వమని సల్పఁగనౌను వితండవాదముల్ ?

గీ॥ అట్లుకాదేని నీదగుయజ్ఞ సూత్ర
ధారణమునకు పూర్వంబు దనరునట్టి
జన్మవర్ణేతరత్వమున సాహసింతె?
అదియు న్యాయదూరంబయా నందురుబుధులు.

గీ॥ ఏలయందువా! నీవువర్ణేతరుండ
వైన బ్రాహ్మణుండవనియు ననగరాదు
యజన యాజనాది షట్కర్మలాచరింప
రాద! యదనీకు నెంచదుర్భరముకాదె?

సీ॥ వర్ణేతరుడననే బ్రాహ్మణుండననుట
పరిహాస పాత్రమౌ భాషయగుట
వర్ణములను నుండువాడనె యంచు బ
ల్కుచుపుగదాయట్టులు వచియించు

పిదప జందెముదాల్పని దశమాత్రమునాకు
శూద్రత్వకాదంట సూరివరులు
మెచ్చగాజాలని పిచ్చివాదమ్మగుఁ
గాన నీతొలిపుట్టుకయది శూద్ర
గీ॥ జన్మయేయనుట బుధులు సమ్మతించు
శాస్త్రవాదంబు; తెలిసి యీసరణినీవు
బ్రాహ్మణత్వమ్ము ధరియింపవలదటంచుఁ
జెప్పనేర్తువె? బాపడా! చెప్పుమనసి!

గీ॥ వైశ్యునకును మొదటి జన్మవలనుఁ గాదె
శూద్రతయయి? పిదప యజ్ఞసూత్రధార
ణమ్మునంగాదె దా ద్విజత్వమ్ము గాంచు
నతఁడు? చెల్లవే శూద్రులకట్టి విధులు?

గీ॥ అట్లె క్షత్రియుల్ శూద్రులై యవతరించి
యజ్ఞసూత్రమ్ము ధరియించి యడ్డులేక
క్షత్రియత్వమ్ములో దూకఁ జాలుటెల్ల
కాంచుచుండమె మనము జగమ్మునందు?

గీ॥ అట్లె బ్రాహ్మణుల్ శూద్రులై యవతరించి
యజ్ఞసూత్రమ్ము ధరియించి యడ్డులేక
బ్రాహ్మణత్వమ్ములో దూకు పద్ధతులను
కాంచుచుంటిమిగాదె జగమ్మునందు?

గీ॥ సత్యమీరీతి నేడును జరుగుచుండ
ఏల వచియింతు బాపడా! యీవు శూద్రు
డనయి జన్మించి బ్రాహ్మణుడవగు టెట్టు
లంచు? మఱచితే కద సత్యమ్ము నీవు?

ఉ॥ ఎఱుగవె? పూర్వకాలమున నెందఱో బాపలు వేద ధర్మవి
స్తరులయి బ్రాహ్మణత్వము నొసంగరె శూద్రజాతికిన్?
పరశువృతాల్చు రాముడు శుభంబని పెక్కురు
శూద్రులన్ నిజం
బరసియు యజ్ఞసూత్రమున బ్రాహ్మణులంబొనరించి
మించఁడే?

గీ॥ పరశురామునికంటెను బ్రాహ్మణోత్త
ములకుఁ బూజ్యులెవ్వారలీపుడమిఁగలరు?
అతడు కావించకృతులు మీకగునుగాదె
తప్పగారాని యాజ్ఞలు తజ్ఞులార?

గీ॥ మనువుకంటెను భూమిలో మాన్యులయిన
ధర్మశాస్త్రజ్ఞులగువారు తనరరంచు
అతని సంతె ఈమానవులంచుఁ బల్కు
చుదుగదా యాతని యాజ్ఞతో్రియునగునె?

గీ॥ బ్రాహ్మణుండు శూద్రత్వమ్ము వడయునంచు
శూద్రుఁడుఁ బ్రాహ్మణత్వమ్ము శ్రుతిహితమ్ము

లైన ధర్మములఁ జేయుచో నందుననుచు
మనువు శాసింపఁడే వేదమార్గమరసి

సీ॥ ధర్మమీవడువునఁ దనరుచుండఁగ నేఁడు
శూద్రులు వేదముల్ సూడఁగాదు
చదువఁగారాదు కాంక్షయు వహింపఁగరాదు
వినుటయుం జెల్లదు విన్నవారి
చెవులను కరిగిన సీసమ్ముఁబోయుమం
చును స్మృతులవి చెప్ప; శ్రుతులుకూడ
వేదమ్ము శూద్రుండు వినరాదు కనరా ద
టంచును విధియించెనట్టులగుట

గీ॥ ధర్మదూరులై బ్రాహ్మణత్వమ్ము కోరు
శూద్రులెల్లరు నరకమ్ము చొచ్చువారె
యని నిషేధించి బాధింపనగునె మీరు?
సత్యపరయుచో ఈ బాధ సలుపఁగలరె?

సీ॥ క్షత్రియుండౌచును జన్మంబుగన్న వి
శ్వామిత్రుఁడందడే బ్రాహ్మణత్వ?
మవల బోగముదాన కాత్మజుండై జనిం
చిన వసిష్ఠుండు తాఁజెందలేదె
బ్రాహ్మణత్వంబు? నాభాగుడన నొప్పు
వైశ్యుఁడరిష్టుఁడర్క వైశ్యవరుఁడు

బ్రాహ్మణత్వంబును బడసిరటంచును
హరివంశ కర్తవ్రాయంగ లేదె!

గీ॥ మఱి పురాణమ్ములందు బ్రాహ్మణా సింది
నట్టి యుపమానములవి సహస్రములుగ
లేవె? అటిహక్కులుమాకు లేవటంచు
పల్కుటది సత్యకార్యంబె బ్రాహ్మణుండ!

గీ॥ బ్రాహ్మణత్వమ్ము జన్మతోవచ్చు వస్తు
వేని నీవంశ చరితమ్ము నెంచిచూడు
ముద్గలుని గోత్రమద్ది విప్రులను నేడు
కలదుగద? గోత్రకర్తముద్గలుడెవండు?

గీ॥ బ్రాహ్మణుండు ముఖమ్మని బాహువులవి
క్షత్రియుండని యువల వైశ్యప్రజాళి
తొడలనియును పాదములు శూద్రుండటంచు
ఈశ్వరుండు వచించుట యెఱుగవా డొ్క?

గీ॥ నాల్గువర్ణముల్ తనకు నన్వాయము సేసి
ఈశ్వరుడు చూపె వర్ణమ్ము లేకమంచు
ఏలనన్యాయబుద్ధి వచింతు వీవు
నాల్గువర్ణముల్ సల్గురు నరులటంచు

గీ॥ వర్ణములునాల్గు నొక్కయీశ్వరుని యంద
ఎట్టులుండునో మనుజుని నట్టులవ్వి
ఆశ్రయించి నాలుగుదశలౌను సత్య
మిద్ది దాచిలోకమ్ము హింసింతువేల?

గీ॥ పరమ పురుషుండు నల్గురు పురుషులనుచు
చెప్పుటీశ్వర ద్రోహమై చెలగుమాడ్కి
నాల్గువర్ణముల్ నల్గురు నరులనుటయు
మానవద్రోహమౌచును మసలు నిజము

గీ॥ వర్ణముల్ నాల్గు నీజన్మవళులులోన
భూమిలో మహాఅవస్థమౌ పుట్టువందు
ఈశుడీవచ్చు వర్ణమొండొద్దియేని
యనుట దైవోక్తులకు భిన్నమగునుకాదె?

గీ॥ బ్రాహ్మణుండీ భవమున శూద్రత్వమంద
నట్లు శూద్రుండు విప్రతనందడనుదు
వెట్టులీ భిన్నప్రకృతులు పుట్టెనీశు
తనువువలన నదియొకటై తనరుచుండ?

ఉ॥ ఒకతనువందనాలుగయియుండునె భిన్నములైన తత్త్వముల్
ప్రకటములౌనె నాలుగగువర్ణములైయవి? యిట్టివాదముల్

వికటపు భాషలై తనరు; విశ్వవిరాట్పురుషుని కీ భిన్నపుర్
ప్రకృతులు నాలుగానుచు బల్కెనె వెనుకు వేద
వాక్కులన్?

గీ॥ నాలుగువర్ణమ్ములొక్కటే నరునియందు
యుండరానివటన్న చో నొక్కడైన
యీశ్వరుని దేహభాగమ్ములేక రీతి
కనని నాల్గుమూర్తులని పల్కంగవలయు

గీ॥ వైశ్యుడును క్షత్రియుండును బ్రాహ్మణుండు
కడకు శూద్రుండు వేర్వేఱుగాగ నుండ్రు;
వారు వేఱుజన్మలవారు వసుధయందు
ఒక్కరు వేఱొక్కరై యున్కియొప్పదనుదె?

సీ॥ ఈశుపాదమ్ములు నీశ్వరు తొడలును
ఈశ్వరుబాహువు లీశుమోము
నాలుగు వేఱగు నాలుగువస్తువు
లొండు వేఱొండుగానుండరాని
భిన్నవస్తువులచే వెలసెనటంచును
బలుకుటెల్ల నసభ్యభాషణంబు
ఈశురూపమ్మొప్ప నేకతత్వంబున
వేర్వేరుప్రకృతులు వెలయువాడి

గీ॥ టంచు బల్కుట వేయువేలయిన నల్వు
రు పురుషులనుటయగునిది రోతకాదె?
ఏకపురుషుని యాత్మజనించి రెట్లొ
భిన్న పురుషులనుటయును వెగటుకాదె?

గీ॥ కానవర్ణముల్ నాల్గు నొక్కండు వేఱొ
కండుగారాని ప్రకృతులు కావు; తథ్య
మరయనొక పురుషుని నాలుగైన ధర్మ
ము లిదియెఱుంగ దుర్వాదముల్ పుట్టవుకద?

సీ॥ పాదంబు శూద్రత్వమై పరగు; నయ్యది
శూద్రత; భువి మనుజులకు నెల్ల
వారికినిగలను; బ్రహ్మచర్యమ్మునం
బెద్దల శుశ్రూష పెద్దసేయు
నప్పటిమాంద్యంబు లంతరించెడి; నంత
వైశ్యత్వమది తానవచ్చి స్త్రీలు
పురుషులు నాత్మనొండొరుల నభిలషింత్రు
కలిసి సౌఖ్యములు కాంచుకొఱకు

గీ॥ దాని నెఱిగియు బఱిణయధర్మమొకడు
పూనితింగూర్చ దోషముల్ పోవంజేయు
ఈశ్వరుండిచ్చెందద్విధ మెఱిగినట్టి
బుధులు రెండవదశ యంచుం జెప్పెదురుదీని

సీ॥ ఈశుని బాహువై యెసగు క్షత్రియత; అ
యద్ది మానవావళికగును పిదప
కష్టసుఖమ్ములు కాంచి, బిడ్డలఁగాంచి,
సౌఖ్యములెన్నొన్నొ చవులుచూచి,
బిడ్డలకొఱకుగాఁ బ్రీతిఁ దమ సుఖమ్ము
విడుతురు దంపతుల్; విడును కామ
సర్వమ్ము మొదలుగాగల తీవ్రవాంఛలు;
బిడ్డలకెన్నియో విధములైన

గీ॥ మేళ్లుసేయుచు తమకును మేలుగాగ,
వారికింగూర్చుచు తమ సర్వమ్ముగాగ
మాఱిపోవగ తొల్లిటి మహార్థ్య; మెఱుక
హెచ్చు జనులు తేజమ్మునై నెసగుచుంద్రు

గీ॥ సర్వజనులకు నందెడి స్వల్పమయిన
క్షత్రియత యిది; బహుళ సంస్కార మొప్పు
ప్రాజ్ఞులకుగల క్షత్రియ ప్రతిభ యరయ
కర్తసంస్కృతి పాటిదై కాలుచుండు

ఉ॥ ఆరయ క్షత్రియత్వమిది, యావలవచ్చు సువిప్రభావ; మె
వ్వారలుగాని మోక్షమును వాంఛనహింపక యుండ; రైన సం
స్కారము చొప్పనంబడయఁ జాలుదురా మహనీయ
తేజమున్

గోరికకుఁ సమానమగు నూతనకాంతి స్ఫురించితోఁపగఁ

గీ॥ విధివశమ్మున సంస్కార విరహితులగు
పరిజలు మరణమ్ము దఱిఁ జేర నచ్చుదాఁక
బ్రహ్మతేజంబె చూడరవ్వాను ప్రజల
కొలదులై యుగ్రపు తేజమ్ము కొలదికాగ

గీ॥ బ్రాహ్మణత్వము భూమి దేవత్వమనుట
తథ్యమది యెల్లజనుల విత్తమ్మటన్న
నుడియు తథ్యంబ; మింట సూర్యుడు వెలుంగ
వస్తువుల్ శక్తికొలదిన ప్రతిఫలించు

గీ॥ అట్లు దివ్యతేజమ్ముచే నలరుబ్రాహ్మ
ణత్వమది కోటికోట్ల రత్నములకాంతి
ధిక్కరించెడు నదెయయ్యు దెలియునరుని
కొలదిమాత్రిమయాచును గోచరించు

గీ॥ కలుషదూషితుడై లోకకంటకుడగు
నరునియందును దైవాంశ పరగునట్లు
లోకవాంఛల మాయలలో మునుంగు
వృద్ధు నందును బ్రహ్మత్వమెంచనగును.

ఉ॥ బమ్మమొగమ్మునన్ బొడమి బాపలమైతిమి వేరుజాతి; తా
మెమ్మెయి నేని బ్రాహ్మణత యీభవమందువహింపజాలరం

చిన్మహిం జెప్పి లోకముల నెల్లను మోసముచేయు విప్రుడుం
బన్నుసుతుండ నందగిన భాసుర తేజము లేకయుండడే?

సీ॥ బ్రాహ్మణత్వమ్మది పరిణామమూటచే
యంత్రిమ్ములో సిద్ధమగుచునుండు
సస్యసంతతివోలె వరల దొక గతిని
వ్యక్తు లుపాసింపవలయుంగాక
ఎవ్వని సంస్కార మెంతయో బ్రహ్మత్వ
మంత యుపాసకు నాశ్రయించు
అవ్వసిష్ఠుండు బ్రాహ్మణుడుగా మఱి నేటి
బాపలస్వారిలో బ్రహ్మహత్య
గీ॥ సేయువాడును బాపండై చెల్లడొక్కొ?
కొలది, గొప్ప సంస్కారమ్ము కొలదినుండు
బ్రాహ్మణులయింట జన్మించు వారిబోలి
బ్రాహ్మణత స్వీకరించెడు వారియందు

సీ॥ కొలదియగా గోదరిత కుక్షినుండి నరుడు
భూమిపైబడు నప్పుట్టి యతని
...సునుండుం బిదప బుద్ధులుసెప్పి క్రమముగాం
తరమి పోద్రోల విద్యావివేక
ములు జనించు; నవల బుట్టు సంసారవాం
ఛలవి వివాహమ్మువలనం జెడ్డ

తోవలంబోనీక తుఱింపగా నాత్మ స
తింగూడి కనుసంతతి నదిమాన

గీ॥ సమ్ముఁబోరాని తోవనుజనక యుండఁ
బట్టిబంధింపఁ గ్రమముగా బరుల కొఱకు
ఆత్మసుఖముల త్యజియించు టభ్యసింతు
రట్టి ధర్మముల్ ప్రాపింబటంపు బుధులు.

గీ। ఇట్టులజ్ఞానియౌచు జనించినట్టి
నరుఁడు తేజస్వియై మహత్తరములైన
రాజకార్యముల్ రచియించి ప్రాజ్ఞుఁడగుచు
గ్రాలి యవల బ్రహ్మత్వము గాంచుఁగోర.

గీ॥ ఇట్టి లోకోత్తరంబైన యట్టి మార్పు
కల్గదొకసారి నాలుగుకాలములను
గాక; శూద్రత, వైశ్యత, క్షత్రియత్వ
ములును బ్రాహ్మణత్వ మనగ వెలయునవియు

సీ॥ వర్ణములొకజన్మఁ బడయగారాదు; నా
లుగు జన్మలకు వచ్చు; లోకమందు
నెవ్వాఁడుఁ దనవర్ణమేరీతి నేనియు
మార్పగాఁజాలడు; మఱుభవమున
నీశుండు పుట్టించునొండొక్క వర్ణము
నందంతెగాక యీయవనియందు

ఈపుట్టువంపునను నేవర్ణపుణ్ వాని
యింటనరుడు జనియించె నంద
గీ॥ జీవితముఁ గడిపి ద్విజులసేవసేయు
నేని యుత్తమజన్మంబు నెత్తుననుచు
మోసగించి తన మొదటిపుట్టుక యది
శూద్రజాతియయను సత్యమ్ముఁ జూపకుండు.

గీ॥ బమ్మ సృజియించెనాలుగు వర్ణములని
చెప్పఁగద బాప!; జేరీతి సృష్టిలోని
వర్ణభిన్నులు దేవుని వారలౌదు?
రెట్లు బాపండు తాసమర్థించు దీని?

గీ॥ విశ్వతశ్చక్షుడను మఱి విశ్వముఖుడ
విశ్వతోహస్తుడను మఱి విశ్వపాదు
డనని చెప్పు దేవుడు భూమినాకసమ్ముఁ
జుక్కలను సృజియింపలేనొక్కొ తలప

గీ॥ అన్ని బ్రహ్మాండములను జేయంగఁగల్గు
వాఁడు వానిలోనివసించు వారి నెల్ల
జేయఁడే బాపలేరీతి సృష్టిలోని
వారిఁగొలిచెదరో నాల్గువర్ణములను?

గీ॥ పంచములను సిద్ధాంతమ్ము నంచకులయి
తెచ్చి రిన్నూరుకోట్లకు హెచ్చుప్రజలు

ప్రిబలు చుందురుకద యీప్రపంచమందె?
ఎట్టు లానూత్రమున వారలిముడఁగలరు?

గీ॥ వర్ణములు నరుని దశలఁ బాదమొకెడ
కాదె సర్వదోషములు చక్కఁగఁ బరిష్క
రింపఁజాలు సూత్రి?మది వచింపలేదె
ఆత్మ సాదృశ్యము నొసంగి యాత్మభవుండు?

గీ॥ బమ్మమొగమును బాహువుల్ పాదవులును
ఒండు వేఁఫోకండగుచును నుండరాని
నాల్గుభిన్న వస్తువులనఁ న్యాయమగునె
ఈశుతనువు ఖండమ్ములై యెట్టులుండు?

గీ॥ ఐక్యమీశు తనువనుదె?; అందయెట్టు
లొండు వేఁఫోకం డగునంట యొప్పరాని
నాల్గుభిన్న వస్తువులు నుండఁగ నేర్చు?
అవిపిశాచమ్ములై యుండునందునొక్కొ?

గీ॥ ఈశుపాదంబులందు జనింపవేని
బ్రాహ్మణుని పాదములవియే వలన వచ్చె?
నీశు మొగమునుండి జనించెననుట
ఈశ్వరద్రోహమౌఁగాదె ఎంచిచూడ

గీ॥ బాపనిపదమ్ము లీశుని పదములందు
భవము గాంచగా లేదనువాదమల్ల
ఈశుపాదమ్ము లకట మహేశు మోము
కంటె దక్కువౌ జుమియని యంటకాదె?

బాపని పదమ్ము లీశుని పదములందు
జనము గాంచగా లేదను వాద మీశు
పదములవి బ్రాహ్మణునివౌ పాదములకు
దగ్గునవి యనుటయెకద! తథ్యమరయ?

గీ॥ ఈశుపదములు మొగమున కించుకేని
గారవమ్మునందగ్గవే కలన నన్న
బాపని పదమ్ము లీశుని పదము లందు
కల్గెనని చెప్పుటకు జంకుగల్గదుగద?

గీ॥ ఈశుపాదముల్ మొగమున కించుకేని
తగ్గుననుట బ్రాహ్మణుని పదమ్ములవ్వి
ఈశుపదములకంటెను హెచ్చనుటయు
నీశుపదములం గరము నిందించుటగును.

సీ॥ బాపనిపాదముల్ పరమేశు మోమున
జన్మించె; నవ్వి యీశ్వరుని పాద
ములయందు పుట్టువుబొందలే; దివి ఈశు
మోముకంటెం గొలది పుట్టుకగను

ట; నని చెప్పుటది ఈశునిపాదములను, మ
హేశురూపంబు దూషించుటయగుఁ
గాక బాపనిపదకమలములవి ఈశు
పదములంబుట్టిన బ్రాహ్మణుఁడు

గీ॥ నగును కొందవవర్ణముల యంతవాఁడు;
అఫయ బాపని పాదమ్ము లమ్మహేశు
పదములం గల్గెననుట యాపాదభవుని
మోము నీశుని మోమునఁ బుట్టెననుటె!

ఉ॥ కావున నీశుపాదములకంటెను బాపనిపాదపద్మముల్
పావనముల్ సు మీయనుట పాపము!; చెల్లని వాదమెంచనా
భావమువీడి బ్రాహ్మణుని పాదము శూద్రునిపాదమట్లు యా
దేవునిపాదజంబ మఱి తేజమునన్ సమమంట చెల్లెశన్

సీ॥ ఈశుమొగమది యాయీశు బాహులకంటె
హెచ్చని చెప్పుట యెల్ల తప్పు
అనల ఈశునిబాహు లాయీశు తొడల కం
టెను హెచ్చనుచును వాకొనుటతప్పు
ఈశుని తొడలవి ఈశుపదమ్ముల
కంటె హెచ్చనుటయు కానిపనియ
తప్పుల తడికెల నొప్పనిరీతిగా
బాపపుసూత్రముల్ పట్టి యల్లి

గీ॥ భవమునలననవచ్చెఁ బోవర్ణములను
హెచ్చు తగ్గులనుచు వచియించి లోక
ములను మోసంబులో నెట్లొ ముంచివేసి
నాశమొనరింతె బాపడా? న్యాయమగునె?

గీ॥ ఈశ్వరునియందు వర్ణమ్ములెట్లు లోక
పురుషునాశ్రయించె నటులె నరుని నొకని
నాశ్రయించి పశలవి యానసుట దాఁచి
చేటు తెచ్చితివనికి దుశ్చింతతోడ.

గీ॥ ఒక్కమానవుని దశల నొకండు వేఱొ
కండుగారాని నాల్గు సంఘములవారి
కంటగట్టుటచే ధ్వంసమయ్యె లోక
మార్యభూమిని సత్యమ్ము నంతరించె.

గీ॥ మోమునంద యా బ్రాహ్మణు పుట్టుననుచు
బాహువులను దొడల నీసు పాదములను
బ్రాహ్మణుని దేహమేనాడు భవము కాంచ
దనుచుఁ బాపసూత్రము భూమి నల్లుకొనియె.

గీ॥ అట్లు క్షత్రియు పుట్టువునమ్మహేశు
బాహువులయందె బుట్టెనఁట భానమబ్బి
అరసి ఘాపాద మస్తకమయిన తనువు
బాహు భవమున్న పాదంబ ప్రిబలె నకట!

గీ॥ అట్ల వైశ్యుని పుట్టువునమ్మ హేశు
తొడలయందు సర్వమ్ము దోఁచెనన్న
వాదమును నమ్మి ప్రజలు దుర్వాదులగుచు
సత్యముఁ వీడి మున్గిరసత్యమందు.

గీ॥ అట్లె శూద్రుని పుట్టువునమ్మ హేశు
పాదములయందె సర్వమ్ము భవముగాంచె
నన్న దుర్వాదమున్ నమ్మునట్లుచేసి
బాపడవ్వారి తక్కువ వారిఁజేసె

గీ॥ సత్యముఁ దాచె బాపడు సర్వజనులు
వేదమెఱుగని వారలై వెఱ్ఱులగుచు
నమ్మిరంతియకాని సత్యమ్ము తరచి
చూడకైరి వేదమ్ములు చూడకున్కి

సీ॥ బాపనిపదముల ప్రక్కని శూద్రుని
పదములు నీశుని పదములంద
జన్మంబుగాంచెనఁ సత్యంబు నంగీక
రింతుమేనియును క్షత్రియుని పదము
లట్లె యీశ్వరుని పదాబ్జంబులందు జ
నించెననియును వచింపవలయు
అట్లపదపడి వైశ్యజనమ్ముల పదమ్ము
లప్పర మేశు దివ్యపదములను

గీ॥ పుట్టువం బెననుచును నొప్పుకొనవలయు
నట్టులంగీకరించుచో అన్నివర్ణ
ములును ఏకంబయంచును పలుకుటెగద!
బాపడా! నేను హెచ్చనిపలుక నగునె?

ఉ॥ కావున నాల్గువర్ణముల గల్గుపొకంపును హెచ్చనంగ; నొం
డవిధింపక్కువై తనర డెక్కువతక్కువలెల్లఁ గల్గెడిన్
గేవల మర్త్యులన్ బ్రజల నెవ్వఁడు వృద్ధత, సత్యనిష్ఠ; వి
ద్యావిభవమ్ము నొప్పితగు, వాఁడొకఁడయ్యెడుఁ బూజ్యుఁ
డెంతయున్

గీ॥ పూజ్యతయది వలయునని పుచ్చుకొందె?
వలచి పరులిచ్చునదియాచు వఱలుఁగాక!
కోరి కొనుకులొసంగునదియు గారవంబు
తక్కనవియెల్ల రాక్షసధర్మములగు.

గీ॥ యజన యాజనాది సుకృతులాచరించి
బ్రహ్మతేజమ్ము కలదని పల్కువారు
అన్యులం జంపి దోషమ్ములాచరించి
ధనము కొనుటొప్పు చేయది తప్పుకాదె?

గీ॥ ఇట్టి హంతకులు లేరె బ్రాహ్మణులయందు
వారిఁ గాదని రే! సంఘబాహ్యులనుచు

బాపనాండ్రకు శూద్రులవలనఁ బుట్టి
పంచములయిన వారితో పాటయేని

గీ॥ పాపమెఱుఁగని నీదగు బంధువులను
తల్లి తప్పును దలపోసి తరతరములు
శిక్ష సేయుదే?నీవారు సేయునట్టి
హత్యలకు అంకులకుఁ బ్రీతియరయవేలొక్కొ?

గీ॥ ఐక్యభావమ్ము కావలెనందు వీవు
నీదు సంఘమ్ములోగల నీచులను హ
తకులను పరులు పూజింపధర్మమగునె?
వారిలోఁ బూజ్యులకు మ్రొక్క వలదెనీవు?

గీ॥ భ్రూణహత్యను జేసియు పూజ్యతముఁడ
బ్రాహ్మణుండందు వారులు ధర్మస్వరూపు
లేని వేదజ్ఞులేని పూజింపరాద
యందు విదియుజాతీయతయగునె చెపుము!

గీ॥ శూద్రుడవగుచు జన్మించి చోద్యముగను
ఇట్టిసేతలు కావించి యేకజాతి
నిష్పరియింపవలయునని నిత్యమీవు
ఘోష సేయుదె! లనమును గొంకులేక?

గీ॥ నీదు జాతీయతకు తగు నిర్వచనము
సేయు; "మెల్లరిసుతల వరింతు నేను
ఎల్లవారి మొక్కులను గ్రహింతు నేను
మొక్క నోరుల; కొసంగను నాపుత్రిఁబెండ్లి"

గీ॥ "అదియ జాతీయతయని నేనందు నాదు
పత్రికలు నల్లె ఘోషించు; పలుకకొండు
పలుకు మీరలు వేదపు పలుకుగాగ
నెంచి జీవితములననుష్ఠింపుఁ" డనుదె!

గీ॥ గ్రామమునందు శూద్రుండనఁ గ్రాలువాడు
వేదవేదాంగ వేత్తయై వృద్ధుఁడును
శీలుఁడునయిన ద్విజుడనఁ జెల్లు నతఁడు
యతనికిఁ మ్రొక్కుటద్ది అన్యాయమగునె!

గీ॥ గ్రామమెల్లను నొక్కటి గాఁగ వలయు
నంచు పదియునాఱేండ్ల బ్రాహ్మణుడు వేద
వేత్తయై మెసఁగెడు శూద్రవృద్ధునకును
మ్రొక్కవలదందు! నైక్యమ్ము పొందుటెట్లు?

గీ॥ పదియు నాఱు వత్సరముల బ్రాహ్మణుఁడు
ఎనుబదేఁడుల క్షత్రియ వృద్ధునకును
సద్గుణఖని కేనియు నమస్కారము సలి
పి వినయము నెఱపుట ధర్మభిన్నమగునె?

# సత్యకాముని చరిత్రము.



గీ॥ శాస్త్రసరణి యెల్లను జూపి చర్చసలిపి
శూద్రతియ బ్రాహ్మణులకు వచ్చును జననము
తోడ నంచుఁ జెప్పితిఁ దృష్టి దోఁపకున్న
సత్యకాముని కథఁ దీర్చు సందియమ్ము

గీ॥ ఈసుఁ డరసి ఛాందోగ్యమం దెల్ల లోక
ములకును ప్రమాణసూచను వెలయుపొంటెఁ
జెప్పినది కావున వివేక మొప్పనరసి
సందియమ్ములు విడుము తత్సత్య మెఱిఁగి

చం॥ కలఁడట సత్యకాముఁడను గారవ మొప్పు కుమారకుం; డతం
డు లలితరీతి వేదవిదుఁడున్ బహువేత్తయునైన గౌతముం
గలిసి సువిప్రధర్మమును గాంచ నొసంగఁగ వేఁడెఁ; నంతటన్
దెలియఁగఁ గోరె గోత్రమది ధీరుఁడు పూజ్యుఁడునైన యొజ్జ
యున్

గీ॥ తనదు గోత్రమ్ము నెఱుఁగక తల్లికడకుఁ
బోయి ప్రీతితోడ బ్రణామమును సలిపి కు
మారుఁ డనియెఁ దల్లి! వచింపు మాత్మగోత్ర
మనుచు నాయమ పలికె సత్యమ్ము తెలిసి.

గీ॥ విప్ర! వినుమ నా యెఱింగిన విధము నెల్ల
ఈ వెనరికి జనించితో యేనెఱుంగ
నొందఱికో సేవకావించుచుంటి నప్పు
డెవరికింగంటి ననుచు వచింపగలను?

గీ॥ సత్యకాముఁడీ విధమెల్ల సత్యరీతి
గౌతమునికి వచింపఁగా గౌరవమున
రమ్ము బ్రహ్మవిద్యకోనుము బ్రాహ్మణుండె!
జన్మసత్యంబు చెప్పగా జాలిత! నియె

గీ॥ తండ్రిలేని వారలకెల్లఁ దండ్రి బ్రహ్మ
కానినీవు బ్రాహ్మణుడవు గాఁగదగదా!
పడయు మొసగెద నీకును బ్రహ్మవిద్య
అనుచు బ్రీతి నాతనిని బ్రాహ్మణుని జేసె.

గీ॥ పరను పితవచియించిన భవ్యచరిత
మిద్ది కల్పవృక్షమువోలె నెన్నియేని
దివ్యఫలముల నొసగుచుఁ దేజరిల్లు
అరయుమా! విప్ర! యందలియర్థములను

గీ॥ సత్యముం జెప్పటం జేసి సత్యకామ!
బ్రాహ్మణుడవు గాదగుదని పల్కినగద!
గౌతముఁడది గణించుచో కలఁడె బాపఁ
డెక్కడేనియు వేయింటి కొక్కడేని!

గీ॥ తండ్రిలేకయ పుట్టిన తనయులయ్యు
సత్యమెఱిగించుచో బ్రహ్మచర్యమట్టి
యీయరాదె నేమును? నిషేధింతురేల
వైనవాక్కులు కాదనదగినవౌకొక్క!

గీ॥ కులటకుఁబుట్టి బాపలై కులుకుచుండ
ఏలయుత్తను క్షత్రియు లీజగమ్ము
నేలువారు కన్న కొమరులేని బ్రాహ్మ
ణత్వమందఁదగరని నిర్ణయమొనర్తు?

గీ॥ అట్లె వేదజ్ఞులై ధర్మమాచరించు
వైశ్యవరుల ధర్మప్రజల్ బ్రాహ్మణత్వ
మేలపొందగాఁ గారాకో? యెఱిగి చెపుము!
బాపడా! నీచు దోషమ్మువలనఁగాక!

గీ॥ భర్తవద్దమ్ముకొనుచు నేభయము లేక
పూమ్రిలనువారితోఁగూడి చూలుగాంచు
కొజేఁగి బ్రాహ్మణునింట జనించిరంచు
బాపలం జేయువో! యడ్డుపాటు లేక?

గీ॥ ఏలశాస్త్రార్థవిదులౌచు ఈభవమున
బ్రాహ్మణత్వమ్ము మోక్షమ్ముఁ బడయఁగోరు
నెల్ల సత్పురుషులను హింసింతువీవు
బాపడా! వేయితప్పుల వాఁడవగుచు?

సీ॥ తెల్లవారెడు వేళ తీర్థమ్ములంగ్రుంకి
సంధ్యలొనర్పగాఁ జాలువారు
వేదముల్ చదివి వివేకమ్ములైన యర్థ
ము లెఱిగించుచు పొద్దుపుచ్చువారు
శిష్యబృందమ్ములం జేరిచి నేర్పిన
వేదముల్ సెప్పుచు వెలయువారు
మోక్షధర్మ మెఱుంగఁ బోవువారిని జేర్చి
మోక్షమార్గము సెప్పఁబూనువారు
గీ। నేఁడు కలరె బ్రాహ్మణులలో? నిర్ణయించి
పలుకుమెన్ని వేలకు నొక్క బాపఁడుండు?
స్వేచ్ఛ బాపలకే యది సేయుటకును
ఇచ్చుదే! పెఱల్ బాపలై యొసఁగరాదె?

గీ॥ బ్రాహ్మణత్వమ్ము లేకయు బాపలనెడు
పేరు మీవారు ధరియింపఁబోరు లేదు!
వేదముఁ బఠించి బ్రాహ్మణవిధులు సలిపి
బాపలౌ వారితోఁ బోరఁ బాలుపడదె?

## జానశ్రుతి చరిత్రము.

గీ॥ సత్యకాము చరితము ఈశ్వరుని శాస
నమ్ము దెలిపెడినైన నన్యంబొకండు

బ్రాహ్మణత్వమ్ము వ్యక్తులుపడయు ధర్మ
మని తెలుపు కథచెప్పి మీ ఆదరుఁదీర్తు

గీ॥ అలరుచుండు జానశ్రుతియను నెడు రాజు
కండు శూద్రుండు కడువివేకమ్ముతోడ
రాజ్యపాలనంబు సలుపు రమ్యమూర్తి
అతఁడు బ్రహ్మవిద్య నెఱుంగ నాత్మఁదలఁచి

గీ॥ రథమధిష్టించి గోవుల రత్నములను
పట్టుపుట్టముల్ భూషలు ప్రబలముగను
జేకొని ప్రమదమెంతయుఁ జెలగుచుండ
రైక్వుడను బ్రాహ్మణునిజేరి రమ్యరీతి

గీ॥ గురువరా! యేనొసఁగెడి యీకొలదు లైన
భూషలన్ గోవులను పట్టుపుట్టములను
కొనిదయను బ్రహ్మ విద్యను గూర్పుమయ్య
అనుచు రైక్వుని కోరగా నతడుకాంచి

గీ॥ వలవదేగుమ యంచును బలుక ఇంటి
కేగి యవల రైక్వుడు వసియించునట్టి
గ్రామముందాన మొనరించు రాజ శాస
నమ్ము నొసగుటయును ప్రమోదమ్ముతోడ

గీ॥ రైక్వుఁడనియె జానశ్రుతి! రాజవరుడ!
పరిమళమొప్పగ నీయూహ రైక్వపర్ణ
మనెడు పేరునం బిల్చెద; నందు మొసగు
వారు నీవుకోరిన యట్టి బ్రహ్మవిద్య

గీ॥ అనుచు సంతసమ్మునను బ్రాహ్మణుడు చెప్పె
వేదవిద్య జానశ్రుతి విబుధునకును
బ్రాహ్మణత్వమ్మునెందు టీభవమునందు
ఎల్లరకు నొప్పునని తేల్చె నీశ్వరుండు

గీ॥ పాపులొకకొందరక్కటా! పావనమగు
నిట్టి చరితమ్ములో బొంకి యెట్లొ శూద్రుఁ
డయిన రాజు జానశ్రుతి యాత్మసతినొ
సంగ రైక్వునకని దిద్దుజాలిరకట!

సీ॥ వేదవిద్యలెఱింగి విబుధుడై తపము కా
వించుకొనెను రైక్వవిబుధుఁడెట్లు
పరుని భార్యనుగోరి పడయఁగానెంచును?
పడయుచో నీశుండు పలుకునెట్లు
లుపనిషత్తులఁగూర్చి?; యుర్విజనుల కెల్ల
ధర్మసిద్ధికొఱకు దయనొసంగి
నట్టిసత్యములగు నాత్మసూక్తుల నెల్లఁ
జెఱిచి పాపపుకథల్ చేర్చి యూసుఁ

గీ॥ దాశ్రసుతుల శీలమ్ము నన్యాయరీతి
బాడు సేయునే? బ్రాహ్మణుల్ పాపులగుచు
చేర్చిన యసభ్యకథనమై చెల్లుఁగాక
యది ఋతమ్మగునని చెప్పనగునె? అకట!

గీ॥ తపముకావించుకొనునట్టి తత్త్వవేత్త
లెవరుఁ భార్యల గ్రహియింప నొప్పుకొండ్రె?
ఏల యన్యాయపుఁ వ్రాతలిట్లు వ్రాయ
నేర్తు బాపడా! ఈసేత నీకుఁదగునె?

గీ॥ శూద్రక్షైన జనసృష్టి శ్రుతిహితమ్ము
గాగ బ్రాహ్మణత్వము కొన్న కరణి భూమి
నెల్లవారలు బ్రహ్మత్వ మీజగతిని
పొందవౌనంటె ఈశుని పూజ్యమతము.

గీ॥ కానిచో నిక్కథవచింపగాఁ గలిగెడి
మేలులేదొండుపైని దుశ్శీలురకును
బ్రహ్మవిద్యనిచ్చి పగులభార్యలను గ్ర
హించుటది చెల్లుననుచు బోధించుటగును!

గీ॥ కానవిట్టి దుర్వాదమ్ము కడకుఁ ద్రోచి
సత్యసిద్ధాంతమొందుచో సర్వజనులు
నిలను సద్బ్రాహ్మణత నహియింపదగున
టంచుఁజెప్పె నీకథఁ బరమాత్మమనకు

సీ॥ రాజ ముఖ్య విజ్ఞానరాశి జానశ్రుతి
బ్రహ్మవేత్తకునిచ్చె భార్యననట
ఋషి సాయ్యు ముప్పొద్దు బుతమ సృష్టించెను
వాడయ్యు పెఱవారి భార్యఁగొనియె
నన్నకార్యశమది స్మార్తె కుర్వేఁడందుట;
అవలలోకమ్ముల కందరాని
మోక్షసిద్ధిని గూర్పఁ బుట్టువ్రుంగాంచిన
యుపనిషత్తుల నీకుఁదొప్పిచెప్పి

గీ॥ ఇట్టి పాపమ్ము లంగీకరించెననుట
ఫలములగు నీకథకు నొందు ఫలములేమి
సర్వసత్యస్వరూపియా జనకునకును
ఇట్టి పాపముఁ గృతులంట గట్టనగునె!

గీ॥ బ్రాహ్మణత్వ ద్విజత్వమ్ము వడయుముందు
శూద్రులై యుందురను సత్యసూక్తిఁ దెలియ
పరమఋషి చెప్పిన కథయై వఱలునిద్ది!
ఋతి నిజము వేఱొక అర్థమెంచఁదగదు.

గీ॥ అరయ శూద్రధర్మంబు తానన్నివర్ణ
ములకును మొదటి పుట్టువై వెలయునద్ది
లేక వర్ణమొకండును లేక యుండు
చెస్ల జన్మింపకే యెందుఁ బెనయగునె!

గీ॥ వర్ణములు నాలుగును శూద్రవర్ణమందు
పుట్టుఁబుట్టి నాదట పూజ్యమైన
యుపనయన సంస్కృతింబొంది యొకజన్మ
ద్విజులగుదురు చూ వెపరిజలు తేజమెసగ

గీ॥ గుడ్డులేకయ పక్షికిఁ గూనయెట్లు
కల్గదోయట్లు శూద్రతి కల్గకుండ
బ్రాహ్మణత్వమ్ము నెవ్వఁడుం బడయఁడిద్ది
సత్యవచనమ్ము వేదవిజ్ఞానమెఱుఁగ

గీ॥ శూద్రతకు జన్మయొక్కటి చూ వెయనుచు
బ్రాహ్మణావళి దుష్టశాస్త్రంబులెల్ల
యొప్పుకొనుఁగద? విపరీతయో! ద్విజన్మ
మంచుదుష్టస్మృతులును వచించుఁగాదె?

గీ॥ ఇంక సందియమ్ములు వహియింపనేల
రెండు జన్మలు కలవియైయుండు క్షత్రి
యత్వమును వైశ్యతయును బ్రాహ్మణత యవల
శూద్రతకొకటె జన్మయై సొంపుమీరు

గీ॥ పాలులేకయ పెరుగు నేర్పడునె? యట్లు
శూద్రుఁడున్న నేగాని ద్విజుండు లేడు
ఆర్యులొప్పిన యిట్టి సత్యమ్ము దాచి
బ్రాహ్మణత హరించిరి కాదె? బాపలకట!

గీ॥ వానరములు శిరము నితరభాగములును
తనవారెంచఁడయి యొప్పఁగతిని సుహాస
నాల్గువర్ణములొక్క జన్మంబయౌచు
వేఱుచేయఁగ రానివై వెలయుఁ జగతి

గీ॥ పూర్వుఁదావియు వేత్త్వేఱుపుట్టువులని
చెప్పుటెల్ల నసత్యమై చెల్లువట్లు
బ్రాహ్మణత్వంబు నాశూద్రవర్ణతయును
వేఱు వేఱంట మెచ్చరు విబుధవరులు

గీ॥ పదియు నెన్మిది యేండ్లలోపలన యుండు
సూర్యుఁడనఁగ బ్రహ్మతేజమ్ము సొంపెసంగు
వాఁడయి జగమున వెలుంగ బ్రాహ్మణునుఁ
బూజసేయ నొప్పునతని పూజ్యుఁడనుచు

గీ॥ నూఱువర్షముల్ నిండియు పేరు చెఱచి
దుష్టుఁడౌచును బాపము తోఁచునేని
అతనిఁ బూజించుటది యనర్హంబు; వాని
గౌరవించుట దేశమ్ముఁ గాల్చివేయు

గీ॥ ఉపనయనము పాపములు సలుపుట కొఱకు
నిచ్చు నంగీకృతియగునె? ఏల బ్రహ్మ
హత్యసేయు బాపనిగని యన్యవర్ణ
ముల జనులు భక్తితోడుత మ్రొక్కవలయు?

గీ॥ ఏమగు నేయుక యున్నట్టి వారలెల్ల
శూద్రులేయను బాపల శుష్కవాద
మొప్పుకొన్నను పూజ్యత పోవునా కొక్క!
పూజ్యులగువారి కెందేని మ్రొక్కవలదె!

గీ॥ పాదములయందు జన్మము వడసెనన్న
దుష్టవాదంబు కొన్నను ధూరమగునె
పూజ్యతయది శూద్రతతికి? పుట్టలేదె
భూమి యీశుపదముల! నీ మ్రొక్కుఁగనదె!

గీ॥ పాదభవులౌట మ్రొక్కు సల్పంగరాదు
శూద్రులకని చెప్పుచు మహేశుని పదమ్ము
లీవు సాష్టాంగము నమస్కరింతుకాదె!
పాదముల్ నమస్కారముల్ పడయఁదగవె?

గీ॥ పాదజుండయి శూద్రుండు పరగుననుట
బ్రాహ్మణుల నమస్కృతులను పడయ దగున
యనుటె ఈశుని పాదమ్మునట్లు; మీదు
మ్రొక్కులకె ఈశుపదములఁ బుట్టె నౌఁడు.

గీ॥ విత్తులేకయ చెట్టది వెలయునట్లు
శూద్రతను జనింపకయ ద్విజుండగునాకొ?
కాన శూద్రత ద్విజతకు స్థానమిచ్చు
జన్మహేతువై యొప్పు నిజమ్ము తెలియ

గీ॥ నినుఁ బండిన్యాయై, నీవు జన్మించుటకును
హేతువైయగు శూద్రినిట్లు కొలది
గాఁగ జూచుట రాక్షస కర్మకాదె?
ఏల బాపడా! ఇట్లు కావింతువీవు!

సీ॥ కావున నేఁటి గాంచిన౯ శూద్రిత
దూషింపరానిదై దోఁచుఁగాదె?
ఎల్లనరులును వహించు మొదటజన్మ
యగుటచే వేదార్థమరయు వార
లదియుఁ బూజ్యత నెంచునట్టి వస్తువనుచు
బల్కుదురు యథార్థ భావమెంచి
అద్దిలేకున్న నెట్టియైన వర్ణములు లే
వదియ ద్విజత్వమై యవతరించు

గీ॥ ఇది యెఱుంగక బ్రాహ్మణులెల్ల మేము
హెచ్చనట రాక్షసత్వంబ యెల్లవారు
ఈసు బిడ్డలు౯ సములని యెఱిఁగి గర్వ
ము౯ విడిచి చిత్తశాంతిని బొందఁ దగదె!

# బ్రాహ్మణుడు అష్టాదశ మహాపాపి కాఁడా?



ఉ॥ బ్రాహ్మణత్వన్ వహించుటది బ్రహ్మకుమారుల కెల్లఁ
జెల్లఁగా।
బ్రాహ్మణ నామధారులును; వారలయింట్లను మాలకేని
యున్
బ్రహ్మచర్యన్ జనింపఁగలవారలు మాత్రము దానిఁబొల్పఁగా
బ్రహ్మ విధించెనంచు నెడబాటొనరించుటె? ఎల్లవారికిన్

గీ॥ బ్రాహ్మణత్వమ్ము మోక్షమ్ము వడయు ధర్మ
ముగ మహేశుఁడీయఁగ దేహమునకు రక్త
మాంసములకును ముడివెట్టి మాన్యధర్మ
మీవు శారీరకము నొనరింతు వేల?

గీ॥ బాపనింటను బొడమని వారలెల్ల
మోక్షమందఁగఁగోరి యీ పూజ్యధర్మ
మాచరింపఁగాఁదలచిన యంత మాత్ర
భ్రష్టులని పాపులని తిట్లు పలుకుదేల?

సీ॥ స్వాధ్యాయ ధర్మంబుఁ జక్కఁగా నెఱిఁగి కా
వించుట పాపమై వెలయునొక్కొ?

ప్రవచన ధర్మంబు పాటించి సేయుట
పాపకార్యమ్మయి పరగునొక్కొ?
యజన ధర్మంబుల నర్థమెఱిగి వేద
విహితముగాగ కావింపఁదగదె?
యాజన ధర్మంబు నర్థించువో నారుల్
తెలిసి సాయపడుట కలుషమగునె?

గీ॥ దానమును బ్రతిగ్రహణమ్ము దద్దఁ దలిసి
యుచితగతి నొఁసగుట; బుధులొప్పురీతి
బొందుటయు —— బాపనింటను పుట్టకున్న ——
దప్పులగునె యెఱిగి సేయుధర్మములును?

గీ॥ మీరు శిరముఁ జేసితి యజుర్వేదమునను;
ఇదియు కుడిచేయి బుక్కగు; నెడమచేయి
సామమగు; బుచ్ఛమో! యథర్వజమ్ముచూవె
అనుచుఁ జెప్పదేవిధి మనుష్యాళికెల్ల?

గీ॥ నాల్గువేదముల్ నేర్చి జనమ్మునిట్లు
పుట్టఁజేయు బ్రాహ్మణతను పొందరాద
టంచుఁ జెప్పగాఁదగునె బ్రాహ్మణుడ! యిద్ది
నీను ప్రథమ పాపమని గణింపరాదె?

## బ్రాహ్మణుని రెండవ మహాపాపము, వేదనిషేధము.



గీ॥ నాలుగు వేదముల్ రూపయి నరుదుకలై
నన్న వేదముల్ చదువుటయది కలుషము
టంచు జనుల నిషేధింపగా నగు నెనీకు?
ఇది ద్వితీయ పాపంబని యెంచదగదె?

గీ॥ వేదములు నిషేధింపగా వెలుగులేక
పరమపిత సత్యవాక్యమ్ము తెలియఁగలేక
శూద్రులనువారు చీకటిఁ జిక్కలేదె?
పంచములు జ్ఞానదూరులై పరగలేదె?

గీ॥ వేదము లుపనిషత్తులు వెలుఁగుఁ దెలుపు
సత్యవాక్కులుగద? వానిఁ జదువకున్కి
జ్ఞానరహితులు బహుళ సంస్కార దూరు
లగుచు శోషింపఁగాలేదె అవనిఁ బ్రజలు?

గీ॥ సోమకాసురనట్లు దుష్టులయి వేద
ములు హరించి యకట రాక్షసులయి మేము
బ్రాహ్మణుల మటంచును ప్రగల్భములు పలుకు
నంతఁ జెల్లునె రాక్షసులనఁ గఁదగరె?

గీ॥ వేద ధర్మంబుఁ దలియుచో విబుధవరులు
మోక్షమందెదరన సూక్తి బుద్ధి నెఱిఁగి

యేల హాని యింతు పాపినై యెల్లవారి
మోక్షమున? కోరి నరకంబుఁబొందు టేల?

చ॥ ఎఱిఁగితొలంగు మీకలుష మెంతయుఁగానిది; దీనిచేభువిన్
నరులకు మోక్షసాధనము నాశము నొంది లభింపకుండు; వే
ఱొకపు మోక్షమార్గము నరుల్గొని మోక్షము నొంద
రాదె! యం
చనకు; మిద్ది మెచ్చరు మహాత్ములు; గొప్పలు దిద్దు
కొమ్మికన్

గీ॥ వేఱుదారుల మోక్షంబు వెదకరాదె?
లేనొకో! పురాణములు తెలిసి చరింప
మోక్షమందరె? యనుచుఁజెప్పుటది రాక్ష
సత్వ; మీవెవండవో! ఇట్టిచర్చ సలుప

సీ॥ ఇచ్చె వేదముల్ గొండొరి పఠింతురి సుతులు
బ్రాహ్మణత్వముం గొరింతురి; దుర్భావుండయి
పొట్టకూటికై, – విప్రత గొందఁదగదు
మీరటన్న నీనుడి వినువారుఁగలరె?

గీ॥ క్షత్రియుండు వైశ్యుడు ప్రవచనముసల్ప
రాదు శూద్రుండు శ్రుతివినరాదటంచుఁ
జెప్పెనే వేదములధాత! సిగ్గుమాలి
వ్రాయగా లేదె పిప్రి! దుర్భావ్యమీవు!

సీ॥ వేదమ్ములోనుండు వెల్కుఁదెల్పెదనంచు
వ్రాసితి బొంకు పురాణములను
స్త్రీలు శూద్రులు మోక్షసిద్ధికి వానిని
బఠియింపఁజాలని పల్కి తెనల
నీదు పుత్రికలును వేదంబు చదువరా
దంచు నిట్లు నిషేధమాచరించి
శూద్రులకెల్ల ద్విజులసేవ చాలంచు
పాపినుడులు చదువరాదటంచు

గీ॥ శూద్రులకు స్త్రీలకును వచించుటకు రాని
ద్రోహమొనరించి యయ్యది దుష్టమని తె
లంపకస్మృతుల నిరికించి కొంపతీసి
తెకట! యేమందు నీదాష్ట్య మార్యభూమి!

గీ॥ వేద వేదాంగము లెఱింగివాదములు పొ
నర్చి సభలలో ధర్మనిర్ణయము సేయఁ
జాలినట్టి స్త్రీజాతి మోక్షంబు కొఱకు
వేదమెఱుఁగరాదని వెలిసేయనౌనె?

గీ॥ పదియు నెనిమిది కోటులై పరగిపాఁడి
పంటల నొసంగు పూజ్యులన్ బాడిమాలి
శూద్రులని వ్రాసి వేదమ్ము చూడకుండఁ
జేసి మోక్షదూరులుగాఁగఁ జేసితకట!

గీ॥ ఏల శంబుకుఁ జంపింప నెంచినాడ
వకట బాపడ!; పరిషత్తునందుఁ జేరి
ఏమి దోషంబుచూపెనో అవ్వసిష్ఠుఁ
డంపె రాముని శంబుకుఁ జంపుకొఱకు.

గీ॥ కోటికొక్కఁడేని తపంబుకొనఁడు వృత్తి
గాగనట్టి పూజ్యుని జంపఁగాఁగలట్టి
వారు బాపలంగాక ఈవసుధ నెందు
నుందురే ఘాతుకులనేని యొంకుజాతి?

గీ॥ వేదముల స్వాపమైనరుల్ వెలసిరన్న
బమ్మనుపుల నరులు తపమ్ము సేయ
నర్హులను సత్యముం దెల్పు నష్టపడకు
మిఁకఁ బరులు తపమ్మొనరించుటకును

బ్రాహ్మణుల నాస్తివషాసము. దేవాలయ గర్భాలయ
ప్రవేశములు నిషేధించుట.



గీ॥ హిందువులగువారికిఁ జెందుగాదె
దేవునాలయమ్ములు? జనద్వేషివగుచు
నత్యజులను గోహితువ్రిల కవ్విపొందఁ
గాని వనుచు శాసించుటర్హంబె? చెప్పుము!

సీ॥ మోక్షము నీ జన్మలో పొందుమనుచుఁ జెప్పి
వేద దూరులుగ గావించినావు!
సర్వజనమ్ములు సౌఖ్యమందుఁడని యూ
రు వెలుపల వసింపఁ ద్రోసినావు
రాజత్వ వైశ్యత్వ రథ్యాధర్మములు కా
వింపకుండను వెలి వేసినావు
శాస్త్రులు కారను శాస్త్రవాదముఁ దెచ్చి
ద్విజసేవయు నిషేధించినావు

గీ॥ నీవు గోహంతృలను గనినీకు దీర
లేదె? దేవాలయముల గడిందిపర్మ
నీవు పూజింప హరిజనుఁ డేగఁదగఁడె?
తరతరములను గనిబూనఁదగునె నీకు?

గీ॥ నీవు కాలమున బుట్టిన నీచుఁడేని
యర్చకత్వంబు నలుపఁగా నర్హుఁడగునె?
సత్యవంతుఁడు గుణిచుఁ బంచముఁడగుని
అర్చకత్వపు సేవసేయుఁగ రాఁడె?

గీ॥ పాపములు సేయు వారలు పరమపితను
చేరి తనుపాపముల నెల్ల చెప్పుకొనుచు
చిత్తశుద్ధి నందరె? గుడిఁ జేరనీవు
పంచముల నక్కటా! ఎంతపాపివీవు!

సీ॥ గర్భాలయంబును గాంక్షతో జేరి చే
సిన పాపములను వచింపరాదె!
కన్నీటి ధారతో కడిగి ఈశుని దేహ
మాత్మశుద్ధిని జెంది యపలసం
నిచ్చవచ్చినటులర్చించి పాపములు వి
సర్జించి పుణ్యముల్ సంతరించి
పరమపిత కడనుపవసించి సాక్షాత్కా
రంబెంది నడవడి తిన్నజేసి

గీ॥ కొని పవిత్రతపొందుట కొఱకుగాదె
గుడులు సృజియించెనీశుండు? కూళనగుమ
అర్చకత్వంబు వహియించి యడ్డవచ్చి
ప్రజల మోక్షంబు చెఱుపంగ పాలుసదె!

గీ॥ ఆలయంబుల కేగుట కష్టపడకు—
పోయి గర్భాలయ స్వయం పూజసేయు
టకును నడంబులవము పలుకకు హరిజ
నముల కేనియు నాల్గువర్ణముల కేని

సీ॥ ఆత్మను జనియించె నాకసంబది; అందు
వాయువు పుట్టె; నవ్వాయువందు
అగ్నిజన్మించెనా యగ్నిలో జలములు
జన్మించె; జలముల జన్మమందె

బృథివి; పృథివియందు నెన్నొ ఓషధులు జ
నించె; నోషధుల జనించె నరులు
అఖిలలోకమ్ములు నాత్మకుక్షిఁ జెలంగు
నాత్మ జనించె బ్రహ్మాండమెల్ల

గీ॥ అనుచు సృష్టిక్రమం బెల్ల నరసి చెప్పి
నట్టి నారాయణునికి నరాళులెల్ల
బిడ్డలౌదురుగాదె? ఇట్లడ్డువచ్చి
దేవుఁ జేరకుండంగ బంధింపనగునె?

శా॥ దైవద్రోహముకాదె బిడ్డలను బొందంగోరఁ డే తండ్రి? దు
ర్భావంబొప్పఁగ అర్చకుండవయి ఏరా పంచమా! యీ గుడిన్
తా వెవ్వారలు నీకు నిత్తురని యాత్రతాత్రిణ ధర్మంబుతో
గావంబూనిన తండ్రి కష్టపడి దుఃఖంబిత్తువే తండ్రికిన్?

గీ॥ బిడ్డలందఱు తండ్రికి ప్రీతిగూర్చు
వారు కారుం డెరి? ఈరీతిఁ బాపినగుచు
తండ్రి మ్రొక్కగావచ్చిన ధన్యసుతుల
పంచములనుచు దఱుమఁగా పాడియగునె

సీ॥ గర్భాలయములను గావింపదగదపూ
జలటంచు ద్రోయుదు క్షత్రియాళి

ఆలయంబులను స్వయంపూజ దగదని
వారించి త్రోలుదు వైశ్యవరుల
శూద్రుండు పరమేశుఁజూడ గర్భగుడికి
రాదగదని త్రోతు రాగవగుచు
పంచమా! అంత్యజ! పాపిష్ఠియంచును
నిను గర్హింతురిల నీచరీతి

గీ॥ త్రోలివేయుదు వెంతయో దూరముగను
అకట! సర్వజనులనిట్లు కలుషగతిని
ఈశుదఱినుండి యావలికెడలఁజేసి
రాక్షసాగ్రణి వౌదు వే? బ్రాహ్మణుండ!

గీ॥ అయిదవదియగు పాపమండ్రిరయు బుధులు
ఈశ్వర ద్రోహమగు నిద్దియింక విడువు
కన్న కొడుకులకు వెలియై గంటనీరు
వెట్టుకొనుచుండె నీతండ్రి వెఱ్ఱివాఁడ!

గీ॥ ఈవు సేసెడి పాపమదెట్టి రీతి
పరిణమించెనో చర్చించియెఱుఁగు గర్భ
గుడికి రాకుండఁ గొడుకులఁ గోలుపోయి
ఈశుఁడే వెలియగుచు దుఃఖించు నెపుడు

గీ॥ ఈశ్వర ద్రోహమిద్ది కావింపఁబోకు
మింక ఎల్లరబిడ్డల నీశుఁజేర్చి

తెప్పవిడిచి సద్బ్రాహ్మణతను వహించి
మోక్షమందుము తండ్రికి ముదముగల్గు.

క్షత్రియ, వైశ్య, శూద్రులకు పంచములనువారికి బ్రాహ్మ
ణుడు ప్రథమనమస్కారము చేయరాదని నిషేధించుట
బ్రాహ్మణుని అరవ మహాపాపము.



గీ॥ పంచముండయ్యెని గుణశీలుఁడై బరగునేని
వర్ణములవారి మ్రొక్కులు వడయరాదె?
గుణముపొందదె పూజ్యత? కులము పూజ్య
తనుగనునె గుణహీనమై తనరునేని.

గీ॥ సర్వజనులును మెచ్చగాఁజాలునట్టి
ఉత్తముండయ్యు పంచము డొందరాదు
ప్రథమనుగు నమస్కృతినని పలుకుటెల్ల
రాక్షసత్వమ్మగునుగాదె బ్రాహ్మణుండ!

గీ॥ శూద్రుఁడిడుగా సుశీలుండు పూజ్యుండునైన
ప్రథమమున నమస్కృతులను పడయవచ్చు
ద్విజులనుండి; కాదనుటెల్ల వేదధర్మ
దూరమగుచును గన్పడు సారమరయ

గీ॥ యజ్ఞసూత్రమ్ము ధరియించుటది తలంప
ఇతరులంగల్గు గుణము గ్రహింప వలన
దనెడు సూత్రమ్ము ధరియించు టనగ రాదు
సేవయే యజ్ఞసూత్రంపు చిహ్నమగును.

గీ॥ కాన నితరుల గుణములు కాంచి బ్రీతి
నెఱుఁగుటయు; తన తప్పుసవరణ సేసి
కొంట; గుణవంతులకు నెల్ల కులముగనక
మ్రొక్కుటయునగునివి జందెపుఁ ఫలములు.

గీ॥ మనుజులెల్లరు బ్రహ్మకు తనుజులంచు
వేదములవి సర్వత్ర కావించు ఘోష
తెలిసి కొందఱికి నమస్కృతి రచియింప
రాదనుట పాపకృతియు దుర్వాదమగును

గీ॥ ఆత్మశుద్ధికి సత్యమ్ము నాత్మ నెఱిగి
బ్రహ్మదేవుని రూపునుబడయు కొఱకు
కోరియెల్ల కులమ్ములవారిఁ గూడ
మ్రొక్కవలయును మోక్షమ్ముఁబొందువాఁడు

గీ॥ ఇతరునింటికి తానేగు నెడలవారె
మ్రొక్కవలయు; తనకడకు బోవునపుడు
నితరులే మ్రొక్కవలయు; చేయెత్తి మ్రొక్క
రాదు తానంట యసురధర్మంబయగును

అది యెఱింగి సంబోధనలందు "అయ్యా!"
యనుటఁ జేర్చి గారవమిచ్చి, అందుమద్ది.

సీ॥ వెంకన్న పుల్లన్న వీరన్న అనుచును
పిలిచినంతనె నీకు పేర్మిరాదు
"దాస"యను పదము తగిలించి యొరులఁ బ
రాభవించిన యంతిరాదు ఘనత
వెంకడా! రామడా! వీరడా! యంచును
పిలుచుట గొప్పనై వెలయఁబోదు
"ఆచార్య" "ఆచారి"యను పదము లితరు
లు ధరింపరాదంటలో గలుగదు
గీ॥ గౌరవము; బ్రాహ్మణులయిజగమ్మునందు
నెల్లవారు వానిని ధరియింపవచ్చు
నొరునిఁ గొలదిగ బిల్చి తన్నున్నతిగను
బిలువఁగోరుట యెల్లను వెఱ్ఱితనము

గీ॥ ఒకనిఁ జండాలుఁడని తికమకలు వెట్టి
శూద్రుడని వేఱొకనిని నీచునిగఁ జూచి
ద్విజులఁ తక్కువ వారని తీసివైచి
ఎల్ల జనుల నీరీతిహింసింతె! విప్ర!

గీ॥ వేదవేదాంగముల్ నేర్పు విబుధునైన
బ్రాహ్మణేతరు గురువుగాఁ బల్కరాదు

బ్రహ్మహత్యలు కావించు బ్రాహ్మణుడును
గురువని వచించుటకు నీకు సిగ్గుకు లేదు

గీ॥ పరులకడ జేరి వేదమ్ము పఠనసేసి
* అంత్యమున నొక బాపనయయ్యఁ జేరి
పాఠములు చెప్పుకున్నను బరమగురుఁడ
నంచుఁ జెప్పుట కులధర్మమయ్యె! నీకు

గీ॥ ఇదియ సంబోధనలను కావించునట్టి
ఏడవదియగు పాపమీ వెంచిచూని
దుష్టించి సద్బ్రాహ్మణత వహియించి దేశ
శాఖ లెల్ల దీసుపరాదె బ్రాహ్మణుఁడ!

---

* "ఆపత్కాల్పో బ్రాహ్మణస్య అబ్రహ్మణా ద్విద్యోప యోగః" అబ్రాహ్మణునుండి బ్రాహ్మణుడు విద్యలు ఆపత్కాల్పముగా బొందవచ్చును. గౌతమ ధర్మసూత్రములు 1-7-1

మఱి శుశ్రూషయో! "అనుగమనం శుశ్రూషా" గౌ॥ ధ॥ సూ॥ 1-7-2 గురువు వెంట నడుచుటే! శుశ్రూష యగునట!

"సమాప్తే బ్రాహ్మణో గురుః" గౌ॥ధ॥సూ॥ (1-7-3) విద్య ముగిసిన తరువాత ఆయబ్రాహ్మణుని గురువుగా అంగీకరింపక ఎవడో ఒక బ్రాహ్మణుని గురువుగా స్వీకరించి అబ్రాహ్మణ గురువుగారికి తిలోదకములు ఒసంగవలయునట! ఇది! బ్రాహ్మణ ధర్మము!

గీ॥ ఇట్టి ఘోర మేదేశమందేని కలదె?
అంత్యమున గురుత్వమ్ము బ్రాహ్మణుని కీయ
నలయుననుట జాతీయత భంగపఱుప
దే గుణద్రోహమునగుచు నెసఁగకున్నె?

బ్రాహ్మణుల సంతర్పణలు, సమారాధనలు. పఙ్క్తులందు శూద్రులనువారు పంచములనువారు చూపఁగూడదని నిషేధించుట బ్రాహ్మణుని ఎనిమిదవ మహాపాపము.



సీ॥ సంతర్పణలనుచు నల్పుచుందువు బ్రాహ్మ
ణేతర హిందువు లిచ్చుధనము
గాని కూరలుం బప్పు నెసలేని పాయసా
న్నమును పెరుగు నేయి తమలపాకు
లింక నెన్ని మొసఁగుచు లెసగుభోజనములు
పొందు బాపనియింటఁ బుట్టినట్టి
బ్రాహ్మణ కృతులను వంటవాండ్రను శవ
వాహకులను, పైని భయము లేక
గీ॥ బ్రహ్మహత్యలు సేసెడివారి నేని
పఙ్క్తిలో జేర్చుకొందువు భవ్యులనుచు
శూద్రులని యన్నదాతలం జూడనీవు
బాపడా! నీదు ధర్మపుఁ బ్రతిభ చూడు!

సీ॥ నరకవాండ్రతోఁ గూడను సుందరుల కేని
పంక్తిభోజనముల నష్టపాటు లేదు!
నీకు జీవనభృతినిచ్చు నీదురాజు
శూద్రుడని త్రోయుదువు! వింత చూడనీవు!

గీ॥ పరమపూజ్యుల చూపులు పాపమనుచు
త్రోసి బాపల జననమందు నరుఁబంచ
పాపముల్ సేయు నతినినే పావనుఁడని
ప్రక్కఁజేరిచి భుజియింతె! ప్రిమద మొప్ప

గీ॥ పిల్లులును గోవులును నీవు పెంచునట్టి
శునకములును నీవింపలు చూడవచ్చు!
వేదమెఱిగి సజ్జనుఁడయి వెలయునట్టి
శూద్రుడనువాఁడు మీవింటు చూడరాదె!

గీ॥ చూచినంతనె పాపంబుచుట్టునటెడి
శూద్రు నాశ్రయించి ధనమ్ము చూఱకొనఁగ
బాపముండను ద్రోహమ్ము పడయవచ్చు!
కాని నీభోజనముచూడఁ గలుషమగును.

సీ॥ తండ్రిశ్రద్దినమందు ధనముగై కొనవచ్చు
శూద్రునింటు మీవింటు చూడరాదు!
మాతృబెండిలియందు కొనవచ్చు నూటాల్లు
శూద్రునింటు మీవింటు చూడరాదు

కొంటుకుఁ బెండిలినిచే కొనవచ్చు నగ్రహా
రమ్ము; నీవగు సమారాధన కన
వచ్చుచో మైలగు; నచ్చంపు భక్తితో
షడ్రసోపేత భోజనము కొంటకు

గీ॥ ధనములొసగి మీమేలు తలచియాత్మ
నీకు సంతర్పణలు సేయు శ్రీకుమారు
లను సమారాధనలు చూడ జనదటంచు
త్రోలివేయు పాపపుబనుల్ త్రోయుటుంక

క్షత్రియ, వైశ్యులను, శూద్రులనుచువారిని, వంచములనువారిని
బ్రాహ్మణ సంతర్పణలు సమారాధనలు వగైరాలకు
అంటుకోరాదని నిషేధించుట బ్రాహ్మణుని
తొమ్మిదవ మహాపాపము.



గీ॥ అంటుకొనవచ్చు విటకాండ్ర ననుదినమ్ము
అంటుకొనవచ్చు బ్రహ్మహత్యలు రచించు
బాపలను కోరి మీ సహపంక్తిఁ జేర్చి
అంటరాదె మీకూడు నృపాళులేని

గీ॥ మడిమడిగనె యుండంగ నేమమ్ముతొలగి
తులసిచెట్టు సన్నిధనె శూద్రుని గరంచు

సతులు మీతోడ గూడి భోజనము సేయు
పాపమబ్బును! మేలులఁ బాలుపడును!

గీ॥ సోమయాజి కుమారిక చోద్యముగను
భర్తలేకయు గర్భంబుఁబడసి యనల
బిడ్డఁడంప బంకకమీరు విందు సేరి
ఏకపంక్తిని భుజియింప నెట్టులేను!

గీ॥ భార్యకోరిక యెఱిగి సెబాసటంచు
తుఱసివానిని భార్యకు తోడుపడఁగ
నింటనుంచి పుట్టినవారి నెల్లఁగొడుకు
లనెడి బాపలక్ సహపంక్తిననుపవచ్చు

గీ॥ కాని వేదార్థములెఱింగి కలుషరహిత
వృత్తి సద్బ్రాహ్మణత వహించువార
లేని మీతోడ భుజియింప నెంచరాదు!
బాపఁడా ఇది ధర్మమై పరగునో కొర్క!

సీ॥ పండితుండవటంచు బాపఁడ! నిన్ఁజేరి
యగ్రహారము లీయనందు కొందు!
కవివంచు నీయెడ గౌరవమ్మునుంచి వే
యుపదాలు లీయగ్రహింపనేస్తు!
వేదవేత్తయటంచు వేడ్కతో నినుబిల్చి
గృహమీయగా నివసింపఁగలవు!

శాస్త్రవేత్తనటంచు సరసుడౌ రాజు భూ
షలు శాల్వలు నొసంగ సంగ్రహింతు!
గీ॥ ప్రీతిఫలమ్ముగ నీసమారాధనలకు
వచ్చుచో మైలయని దూఱెవాపుదనల
బాపనింటఁబుట్టిన యెట్టిపాపినేని
వెంటఁగొని భుజియింతు! విల్లుంటనగునె?

బ్రాహ్మణేతర హిందువులు పరిషత్తులకు అధ్యక్షత వహింప
రాదనియు వారు బ్రాహ్మణులతో సమానులు కారనియు
సంఘములను వారు పరిషత్తులకు రారాదనియు
నిషేధించుట బ్రాహ్మణుని సదియున
మహాపాపము.



గీ॥ మీరుపరిషత్తులంజేరి మిమ్ముఁగూడి
సమత భాషింపరాదె పంచములనియెడి
వారు శూద్రులనెడువారు భారతీయు
లగుదురుకద? మీసభలువారందరాదె?

సీ॥ ఇతఁడు పంచముఁడంచు నెంతయు ఘోరమౌ
శిక్షనొసగ నీకచెల్లునొక్కొ?
ఇతఁడు శూద్రుఁడయంచు నెంచి ద్విజుల సేవ
సేయుమనుచు నీవ చెప్పవొక్కొ?

ఇతఁడు క్షత్రియుఁడంచు నితనికి బ్రాహ్మణ
త్వ మొగడనఁగ నీవ తగుదువా కొ...!
ఇతఁడు వైశ్యుఁడటంచు నితనికి విప్రత్వ
మ్మొంద గవనఁ జాలుదా కొ...
గీ॥ వారివారి విషయముల వారు వారు
తమకుఁ దోచిన రీతిమై ధర్మనిర్ణ
యమ్ము చేసికోఁదగరె? యన్యాయరీతి
వారిధర్మముల్ సెప్ప నెవ్వండవీవు?

గీ॥ నీవు పరిషత్తులవి పాపనిలయములని
నేఁడులోకమ్ము తెలిసె నీ నిర్ణయమ్ము
వినెడు వారింక లేరెందు; వెఱ్ఱివగుచు
జాతి కధికారివని పల్కఁజనదు నీకు!

సీ॥ క్షత్రియత్వము నొందఁజాలవంచును నద్ది
క్షత్రియేతరులలోఁ జంపినావు!
వైశ్యత్వముం బొందవలదని యద్దాని
వైశ్యేతరులయందు జంపినావు!
బ్రాహ్మణత్వము నొందఁ బాపమనుచు నద్ది
బ్రాహ్మణేతరులలోఁ బాపినావు!
శూద్రత్వముంజెంద సొంపుగాదనియద్ది
శూద్రేతరులఁ ద్రుంప జొచ్చినావు!

గీ॥ బ్రాహ్మణతయు వైశ్యతయు క్షాత్రమ్ము శూద్ర
ధర్మముఁగల్గి వెలయంగఁదగిన భార
తీయులక్కట నన్నిటదీనులగుచు
భారతావనిఁగోల్పోయి భ్రష్టులైరి!

గీ॥ క్షాత్ర మెక్కరి సొత్తె! యాక్షాత్రమీవు
క్షత్రియేతరులంజంపి క్షాత్రభూమి
నకట పరుల పాల్సేయవే? ఆర్యభూమి
పరుల చేతులనేరీతిఁ బడెనో? చెపుము!

గీ॥ బ్రదుకు కోఅకు క్షేత్రముదున్న వలయునన్న
వైశ్యులై పుట్టుటొక్కటేవలయు నర్హ
తయను దోకో? నేడు శూద్రులై తనరువారు
భూములువిడిచి వనములం బోవనౌనె?

గీ॥ బాపలౌవారికన్ని పాపములను రచి
యించుటకును హక్కుగలదె? యితరులరసి
వర్ణధర్మమ్ములను పేర భ్రష్టఁగని
నట్టి పాపముల్ విడవంగ హక్కు లేదె?

గీ॥ పంచముఁడనువాడధ్యక్ష పదవియందుఁ
జెలఁగ బాపఁడు సభయందుఁ జేరరాదె?
"జాతి"యనుదు "జాతీయత సర్వజనులు
నేర్వఁదగు"నందు విధి ధర్మనిర్ణయంబె?

సీ॥ రాజత్వ యోధత్వ వైశ్య భటత్వముల్
కొందఱి కొసఁగితి కులుకుమీఱ
సేద్యమ్మునవలఁ గుపేదమ్మ వాణిజ్య
మును కొందఱకునిచ్చి పోరులేక
ధర్మనిర్ణయమును ధర్మ శాస్త్రరచన
మంత్రిత్వముంబోలు మాన్యకృతులు
ఈవు కొని పిదప హీనవృత్తులకట!
ద్విజసేవయన్ పేరుతో దీనులైన
గీ॥ శూద్రులనువారికిచ్చి యాశూద్రవృత్తి
నేని హరిజనులకిడక యిట్టులెన్ని
నేని ద్రోహముల్ సేసితివింకఁ జాలు
నీదు పెత్తనమ్మది విప్ర! నిమురపొమ్ము

క్షత్రియులు, వైశ్యులు శూద్రులనువారు, పంచములనువారు తనతో సమానముగా తన పడమటింటిలో భుజింప రావని నిషేధించుట బ్రాహ్మణుని పదునొకండవ మహాపాపము.



గీ॥ నీకు జీవిక నొసగెడి నీదురాజు
వార్షికమ్మిచ్చు ప్రభువరు వైసిమాలి
నీగృహమున భుజింపగా నెట్లొ సమ్మ
తించుచో వెలుపల భుజియింపనేతె?

గీ॥ నిన్న మొన్న నె హత్యలవెన్నొ నేసి
ఉరికిబోవు బాపఁడు వచ్చియుండు నేని
పడమటింటిలో నీ సహాపంక్తి గుడిపి
నీదు రక్షకు వెలుపలఁ నిల్పివై తే!

గీ॥ బ్రహ్మ హంతను సంతోషపఱచి తమ్మ
లమ్ము గైకొన్న పిదప గృహమ్ము వెలుప
లఁ భుజింపఁగాఁ జేతె యలక్ష్య మొప్ప
ఇది కృతజ్ఞతయొకొ! యుపకృతుల కెల్ల

గీ॥ అంతెఁ దృప్తిగనక విస్తరాకు నెత్తి
వేయఁగాఁ జేతె? యాపైని వెగటుగాఁగ
పేడనలికింతె! ఈరీతి పీడ నేసి
నీను మిత్రుఁడనంచు వర్ణించుకొందె?

సీ॥ అతిథి దేవోభవ యంచు వేదమ్ములు
పఠియించి ఇట్లు నీప్రభుఁడు నేని
నీకు జీవికనిచ్చు నీరక్షకుల నేని
ఇంటి వెలుపల భుజింప జేయఁ
జెల్లునే నిత్యము సేసెదు నీసంధ్య
నతిథి దేవుని రూపటంచుఁ జెప్పి

చూడవే నీకు శూద్రింప క్షత్రియుడవై
 వైశ్యుండవు నతిథులు కానొప్పరనుచు

గీ॥ వేదముల్ సెప్పెనే? ధర్మభిన్నములగు
అర్థముల్ స్మృతులనుచు వ్రాయంగ జెల్లు
నో కో? యిట్టి దుష్టాచారమ్ము లొప్పకొంద్రె
బుధులు? పాపివై పాపంబు బూనితికట!

ఉ॥ రాత్రిరి మంచ మెక్కి రతిరాజు సుఖమ్ముల శూద్రి
 జేల్చుచున్
పాతకమంచు నెంచకయ భ్రష్టత గాంచిన నీవు పుత్రికన్
జూతువు ప్రేమ పెంపెసగి చూడగ నొనన్ సహపంక్తి భోజన
మ్మేతిరి చేని సేతువు; భరించెదు మిత్రుల ద్రోయ చెల్లునే?

సీ॥ ఆదరమ్మున నీకు అర్థమిచ్చెడివారి
 కింటి వెలుపల కావింతె విందు?
ప్రేమతో దానముల్ పిల్చి చేసెడివారి
 కింటి వెలుపల కావింతె విందు?
అగ్రహారములిచ్చి యర్చించువారికి
 నింటి వెలుపల కావింతె విందు?
గృహములొసగి రక్షించెదువారికి
 ఇంటి వెలపల కావింతె విందు?

గీ॥ నీమ పోషకుల కిటువర్ణింపరాని
లజ్జగూర్చి నీ కొలపుఁగులటుల నేని
బ్రహ్మ హంతల నేని యేవంతలేక
పిలిచి పడమటింట భుజింపఁగలవె సెరి?

గీ॥ బాపలెల్లరు భుజియించు వఱకునిల్చి
విదప నింటివెలుపలనే బెగడులేక
కాఁపువడ్డింతే! యిట్టి నీకూళతినము
ధర్మకార్యంబ అనగను తగునె చెపుము!

నాల్గువర్ణములవారి పిల్లలను వివాహమాడుటకుఁ దన కధికా
రము కలదనియు దనపిల్లను క్షత్రియులు, వైశ్యులు
శూద్రులనువారు వివాహము చేసికొనరాదనియు
నిషేధించుట బ్రాహ్మణుని నదిరెండవ
మహా పాపము.



గీ॥ వేదవిహితమ్ముగాగను బెండ్లి నాల్గు
వర్ణములవారు నొండొరుల్ వలచి సేసి
కొన్నచో దోసమౌనొకో? కోరి అంకు
సేసిన నెటిగి యడ్డంబు సెప్పకుండె?

గీ॥ అంకులెన్నొ చేసినను నేరమ్ముఁగానవు
శూద్రుఁడొకడు బ్రాహ్మణకన్యఁజూచి పేర్మి

వేద విహితమార్గమిటుగాఁ బెండ్లియాడ
నేప్పుడేటికి లోకమ్ము లెగిరిపోవ!

గీ॥ మతమునువిడిచి యార్యసమాజమనియొ
పండిలి రజిష్టరున సివిల్ పెండ్లి గతినొ
పెండ్లియాడెదనను నీదుబిడ్డలకును
దారిచూపకయుండుట మతధర్మమగునె!

సీ॥ తురకను బెండ్లియా మహాత్మునిగన్గొని
మంచిపనియని సమ్మానమిత్తు
తెల్లవానిని బెండ్లి తెంపుమైనాడంగ
అడ్డంబుచెప్పక యాదరింతు
శూద్రునితో బెండ్లి చూడంగనేగుదు
తప్పని ఖండించి చెప్పబోవు
ధనమున్న పంచముల్ దర్పంబుతో బెండ్లి
యాడ నడ్డంబుసేయంగఁ బోవు
గీ॥ నీదు పుత్రికల్ మతమును నిన్నువిడిచి
చేయు పెండ్లిండ్లుచూచి కృశింతు వాత్మ
నాల్గు వర్ణముల్ శ్రుతిహిత న్యాయముగను
పెండ్లియాడ ననుమతి కావింపరాదె?

గీ॥ మతము నానాటికినిదగ్గి మ్రిందుచుండ
ప్రవ మొప్పనియట్టి మర్యాదమొకటి

కొని విలోమమును బ్రతిలోమమనెడి పేర్ల
వర్ణములలోని పెండ్లిండ్లు బాపదగునె?

గీ॥ బ్రాహ్మణుని పుత్రికను శూద్రవరుడొందుఁ
బెండ్లి కారాదటంచును వేదమందు
చెప్పెనేధాత? స్మృతులని చెడ్డస్మృతులు
వ్రాసినంతనే వేదమ్ము వ్యర్థమగునె?

గీ॥ ఆరుకోట్ల పంచములు నీయాత్మజులకు
గల్గినట్టి సంతానమై కారలేదె?
ఏల యంత విజేవిగాగ నెసగినట్టి
మంచి యాచారముందుఁ్రింప మనసువుట్టె?

గీ॥ కాదటన్నను పూర్వమ్ము కల్గినట్టి
మార్గమేరీతిగా నేడు మాసిపోవు?
హరిజనులు నీవారు కారనుటయెట్లు?
నీదు గాహితుల్రలని స్మృతుల్ నిర్ణయింప

గీ॥ కోట్లకొలదిగా నీసుతల్ కోరి సేసి
కొన్న బాంధవ్యముందుఁ్రించు కొఱకు లేని
పోని శాస్త్రముల్ వలుకంగ బోకుమవ్వి
సత్యమ్ముఁ మూసివేయఁగాఁ జాలవెపుడు

సీ॥ పంచముల్ నీదగు బంధువులన్న వో
కోపంబు వహించి యింపంగూడ దెంచు
అట్టి ధార్మికులు యోగ్య బ్రాహ్మణులు మీకు
బంధువులైయుంట పరమ శుభము
వారలు కాదొకో భారతి పంటల
పండించి యిచ్చెడు పరమపూజ్యు
లట్టివారిని కాదటంచు త్రోయదగదు
దోషమ్ములెపుడు నెందును జెలంగు
గీ॥ చచ్చిన శవపు మాంసమ్ము జంకులేక
తించురనుదే? వసిష్ఠుండు తెలియు పెద్ద
అతడు ఋషలును శవమాంసమరసి తినగ
నేగరె! విధికృతము దాట నెవరితరము?

గీ॥ యజ్ఞములనుచు జంతువు హత్యచేసి
ఎంచలకొలందిగాగను బ్రాహ్మణులది
పంచుకొని హర్షమున భుజింపగన మొకొ?
పరులనంజుడు తిండోని పలుకనగునె?

గీ॥ నంజుడుం దినుటయె కారణమ్ము వెలికి
ననుదె? బ్రాహ్మణులకు వింధ్య కవలిభూమి
కాదొకో ప్రమాణ? మిటగల వేదవిదులు
బ్రాహ్మణుల్ నంజుడుతిని గౌరవముకనరె?

గీ॥ ఉత్తరమునకు నీవేగుచుందుగాదె?
వారిపంక్తి బాహ్యులనుచు వదలితొక్కొ?
వారివిందు పిలుపు బహిష్కారము పోన
రింపఁజాలితే రిత్తవచింతు వేల?

గీ॥ దక్షిణమునకు నట్టి మత్స్యములుదినెడు
బ్రాహ్మణుల్ రాగ ప్రేమంబు పట్టుకాని
వైసెలంగ విందొసగవె ఆదరించి
ఏకపంక్తినిఁగూడి భుజింపనొక్కొ?

గీ॥ కాన మాంసంబు దినుటచేఁగల్గె పంక్తి
బాహ్యతయది శూద్రులకును పంచములకు
ననఁగరాద; వైశ్యులు నంజుడంటరుకద
వారి వెలివేయఁగానేలవలయు నీకు?

గీ॥ హింసయనగను భయమది యింతనీకు
గల్గునేని బ్రాహ్మణులలో గలుగునట్టి
మాంస భుక్కులవెలిసేయ మానదేల?
నీతిలవమేని బాపడా! నీకుగలదె?

గీ॥ ఇతరులను వెలివేసి యీవెంతయేని
హెచ్చువాడననుచును గర్వించుపొంటె
చేసిన కృతియు నీతిరక్షించి జగముఁ
బ్రోవఁగాఁజేసితి ననఁగఁబోలు నొక్కొ?

గీ॥ నాయకుఁడవు వెలికారణమ్మటంచు
చెప్పఁగాఁబోకు మొదలను చిన్నవారిఁ
జేసి పెద్దపేరు గొనఁగ జేసినట్టి
కార్యమనుచు నెఱుఁగరె జగమ్ము వారు?

గీ॥ నీవు నున్నతికొఱకయి నీతిమాలి
దేవునికిని మానవునకు తీరరాని
ద్రోహ మొనరించి వేరమ్ము త్రోసివైచి
ఇతరుల పరాభవింతువె ఇట్టులకట!

గీ॥ హరిజనుల దోషముం దిద్ద నాత్మఁ దలతు
మేని రెండేండ్లలో సంస్కరింప వచ్చు
దోషముల్లేని నరులెందుఁ దోషపుర్వి
దిద్దుకొని మైత్రి నుండుటే తెలివి చూవె

గీ॥ కానివారని పోరఁగాఁ గలదె ఫలము?
నిత్యముం బోర వగపు జనించునంత
కంటె వేఱుమేలు జనింప; దార్యభూమి
చీలి ముక్కలౌ, బొందుగాఁ గాంక్షింపు మరసి

గీ॥ హరిజనులును మనవార లన్యులనుచు
ద్రోయఁగాఁ దగదె మేని దోషమున్న
దిద్దుకొందురు ప్రేమతోఁ దెలియఁ జెప్ప
మిండ్లకుం బోయి చెల్మి కావించి యీవు

గీ॥ శుచియు నలవడు దేహమ్ము సొంపుగాగ
దిద్దుకొందురు స్నానముల్ తీర్చుకొందు;
కారె సోదరుల్? వారిని కాని శత్రు
లంబలెఁ బరాభవించు టల్పత్వమగును

గీ॥ హరిజనుల్ కష్టపడనేర్చినట్టివారు
పాడిపంటలు పండించి ప్రజలకెల్ల
అన్నమిచ్చెడువారు సత్యమ్ముకల్గు
వారు వారిఁగష్టము పెట్టవలదు మనకు!

గీ॥ యజ్ఞసూత్రమ్మునిచ్చి వేదార్థమెల్లఁ
జెప్పి సద్బ్రాహ్మణులుగాగఁ జల్పి ప్రీతి
పిల్లనిచ్చి పెండిలిసేయ పెంపుఁగల్గు
బాచములనుచు నిందింప ఫలము లేదు॥

సీ॥ నాల్గువర్ణముల కన్యకలను బెండ్లియా
డెద నాకుమారిఁ బెండిలినిగొన ని
తరవర్ణముల హక్కెవరికి లేదంచును
వేదవిరుద్ధమా వెట్టివ్రాత
యెట్టులో వ్రాసి కావించితి మోసమ్ము
అట్టి దుర్మార్గమ్ము లాచరించు
టింకసాగదు సత్యమరసి యధర్మంబు
లెల్లతొలఁచి సవరింపుమార్య

గీ॥ మతము దేశంబులో నైకమత్యమబ్బ
వేదధర్మంబు సెలరేగు విస్తృతమయి
ఏకజాతీయ భావంబు హెచ్చిభార
తావనియు స్వర్గమై సుఖమందునిజము

స్త్రీలకు పురుషులహక్కులు లేవని నిషేధించుట
బ్రాహ్మణుని నడుమూఁడవ మహాపాపము.



క॥ పురుషులు స్త్రీలున్ వేఱుగు
దురె? ఒకతీరునన పుట్టుదురు కాదే? యా
పరమేష్ఠి దేహతత్త్వము
లరచించినె భేదమొందు లలనలకిరయన్.

క॥ పురుషుల హక్కులు స్త్రీలకు
కొఱగానివటంచుఁ జెప్పఁగూడునె? యెందేన్
సరసిజలోచన లేకయ
జనుఁగఁగలదె యిహపరములొసంగు కృతులలోన్.

ఉ॥ బ్రాహ్మణధర్మముం గొనుట భామలకున్ దగదంచు నెందునేన్
బ్రహ్మవచించెనోక్కొ? శ్రుతివాక్యములెల్ల నెఱింగి చర్చలన్
బ్రాహ్మణులన్ సభాస్థలుల వాదము సేసి జయింపలేదె? యో
బ్రాహ్మణ! నీ కుమారికల బ్రాహ్మణధర్మము దొంగ
లించుదే?

సీ॥ బాహ్మణధర్మంబు పడయకుండెడివారు
శూద్రులై వేఱొక చూలునంద
బ్రహ్మత్వమందెడి భాగ్యమ్ము కండ్రని
చెప్పుచుందువుకాదె? చిత్రమెట్లు
పుత్రికా రత్నముల్ మోక్షమ్ము నొందంగ
బ్రాహ్మణత్వమ్మును బడయరాద
టంచు ద్రోహమ్ము నీవాచరింపగ నెంచి?
తిక్కటు! నీద్రోహమద్దిచేర

గీ॥ రాని తావులేదొక్కొ? భారతమునందు
క్షత్రియులకు, వైశ్యులకుఁ బంచములనియెడి
వారికిని శూద్రులకును నీభార్యలకును
ద్రోహమొనరింతె! వేదమ్ముఁద్రోసిపుచ్చి

సీ॥ వేదమ్ము చదువని విప్రత్వమందని
భార్యశూద్రియగుచు వరలుగాదె?
శూద్రియైయుండెడి సుదతికి గర్భడు
చూలు విప్రత్వంబు గోలుపడుచు
నీదు సిద్ధాంతమ్ము నియమంచు రీతిగా
బ్రాహ్మణుల్ గాకయ భ్రష్టులగుచు
ధర్మరహితులయి తనరుచురంచును
పలుకుదువుకద? యేవలన నీదు

గీ॥ సుతులు బ్రాహ్మణులౌదురో చూచి చెపుము
నీవు సూక్ష్మశాస్త్రమ్ముల నిర్ణయములు;
కన్నకొమరితెలకు ద్రోహమెన్న నీవు
ఇతరులకు మేలుసేయఁగా నెంచఁగలవె!

గీ॥ యజ్ఞసూత్రమ్ము దినమొక్కటైన విడువ
రాదు విడుచునో ద్విజుడు శూద్రత్వమందు
ననుచు శాసించెనీవు శాస్త్రోక్తి; యెట్లు
నీసుపుత్రికామణి బ్రాహ్మణియగుఁ జెపుము!

గీ॥ స్త్రీలకుఁ బురుషులకు ధర్మసిద్ధి కెఱు
వేఱటంచును పల్కెనె వేదమెందు
నేని! ఆత్మధర్మంబు లవెల్లనొక్క
తీరెగద తత్త్వము తెలియువారలకును

గీ॥ అట్టివో నీవు దుష్టమౌనట్టి గతిని
స్త్రీలకుఁ బవిత్రధర్మంబు తీసివేసి
బ్రాహ్మణత్వంబు హరియించి బ్రాహ్మణుండ
అస్మసుతలకు ద్రోహమ్ము నాచరింతె?

ఉ॥ స్త్రీలకు జేయుద్రోహమది చేయవెహానీ? త్వదీయ దేహపుం
బాలయి కష్టసౌఖ్యముల భారముఁ జెందిగృహమ్ములందు దా
మేలిక తొంచు నీకయి రచింతురెగాదె సమస్తధర్మముల్
బోలునె యట్టివారలను మోసము చేయుట వేదదూరతన్?

సీ॥ అన్నమయమ్మగునట్టి కోశమ్మది
స్త్రీలకు నీకు రచించెనొకట
ప్రాణమ్మయమ్మాచుఁ బరగు కోశమ్మది
స్త్రీలకునీకు రచించె నొకట
విజ్ఞానమయమటంచు వెలయు కోశమ్మది
స్త్రీలకు నీకు రచించె నొకట
ఆనందమయమటంచు నలరుకోశమ్మది
స్త్రీలకు నీకు రచించెనొకట

గీ॥ దేహ తత్త్వమ్మునందెందు స్త్రీలకును పు
రుషులకును భేదముండుట రూఢియనుచుఁ
జెప్పెనే బ్రహ్మసూత్రములలో? స్మృతులటంచు
పాపపుఁ వ్రాతవ్రాయదే బ్రాహ్మణుండ?

గీ॥ అర్థమున కామ మోక్షంబులందు ధర్మ
మయిన తెరవుతో నిను గూడి ఆత్మసిద్ధి
బొంది నీకును సిద్ధిని బొందజేయు
సతికిద్రోహమ్ము సల్పగా జాలి తెల్పు?

గీ॥ బ్రాహ్మణత్వమ్ము మోక్షంబు వడయుకొఱకు
ఇచ్చెగా దొక్క విశ్వమ్ము లెల్లనేయు
బమ్మ? యెట్లు గాదంచు మోసమ్ము సేసి
స్త్రీకి లేకుండ జేయగా నీకు నేను?

బ్రాహ్మణధర్మము ననుష్ఠించుటకును ధర్మశాస్త్రరచన, ధర్మ
నిర్ణయము మంత్రిత్వములు చేయుటకును బ్రాహ్మ
ణేతరహిందువులకు హక్కు లేదనుట బ్రాహ్మ
ణుని వదునాల్గవ మహాపాపము.



గీ॥ ధర్మశాస్త్రరచనమును ధర్మనిర్ణ
యంబు బ్రాహ్మణుడె సలుప నౌనటంచు
నితరులర్హులు కారంచు నింతచేటు
కూర్చితివి భారతికి స్వేచ్ఛ గూలద్రోసి

సీ॥ గ్రామంబునం బెద్ద గానుండు క్షత్రియు
మొక్కరాదను తప్పుపోక పోయి
గ్రామంబునం బెద్దగానుండు వైశ్యుని
మొక్కరాదను తప్పుపోకపోయి
గ్రామంబునం బెద్దగానుండుశూద్రుని
మొక్కరాదను తప్పుపోకపోయి
గ్రామంబునం బెద్దగానుండు పంచము
మొక్కరాదను తప్పుపోకపోయి

గీ॥ ధర్మశాస్త్రరచనమువధర్మరక్ష
ణమ్ము పాల్పేసి సర్వదేశమ్ము చీలి

కలుగచేసి జాతీయతం గాల్చివేసి
పరులపాల్సేతె భారతిన్ బ్రాహ్మణుండ!

క॥ జాతీయతయన బ్రాహ్మణ
జాతికి సర్వజనములని శమ్మును భక్తిన్
చేతులు మోడిచి మొక్కుట
యైతనరునె బరులు మొక్కుటందగదగకే!

సీ॥ అష్టాదశమ్ముతా నఘములంజిక్కినన్
బ్రాహ్మణునకె మొక్కవలయు ననరె?
వేదంబునన్ గల విధులెల్లఁ బోఁద్రోసి
బాపడె ఇలను దైవంబటంచు
దొంగవ్రాతలువ్రాసి దోర్బలశక్తిచే
భూమిరక్షించు ప్రభువులు మొక్క
నర్హులు గారని, యవల వైశ్యులను గా
దని శూద్రులనియెడు నట్టివారు

గీ॥ వేదదూరులని గుణులై వెలయునట్టి
వారికేని విప్రుడు నమాస్కార మొరుల
కున్ రచింపరాదనియు నిట్లు కూళవగుచు
చెడ్డధర్మముల్ వ్రాయుదే స్మృతులటంచు!

గీ॥ తప్పవాడైన బ్రాహ్మణుం దండనంబు
సేయరాదని యేతప్పసేయ కేత

పమ్ము నల్పెడు శూద్రునే పాపరీతి
బంపు జేసి ధర్మనను జె జంకులేక?

గీ॥ వేదముల్ విన్న శూద్రుని వెదకిపట్టి
చెవులలో వెన్నకాగిన సీసమును జొ
నిపి యుసురుగొన దగునని నిర్ణయించె!
బ్రాహ్మణుడ! యెందునిట్టి ఘోరములుగలవె?

సీ॥ స్మృతులలో నెందేని శూద్రుండు వేదమ్ము
పఠియింపరాదని పల్కెనొక్కొ
క్షత్రియుండును బ్రవచనము సలుపదగ
దని నిగమాళిలో ననియెనొక్కొ?
వైశ్యుండు తెలిసి ప్రవచనము సేయుచో
తప్పంచు తేటగ చెప్పెనొక్కొ
వేదమ్ము చదువుట వినుటయు హరిజను
లకుదగదని నొసళ్లను లిఖించె

గీ॥ నొక్కొ ధాత? పాపపుగతి నక్కటకట!
దేవుడనుపేర, వేదమ్ములో వెలయునని—
బొంకిస్మృతులలో శాసనములుగవ్రాసి
జాతినాశంబొనర్తువే! భీతిలేక?

గీ॥ ఈసుపేర ద్రోహములు కావించుసతని
కంటె పాపిలోకమ్ములోగలఁడె? యేల
పాపివై బ్రాహ్మణత్వమ్ము పడయరాని
ధర్మవని వచింపనేర్తు సత్యమ్ము విడిచి?

గీ॥ ధర్మశాస్త్రరచన పరుల్ తాకరాని
వస్తువని చెప్పియేయడ్డు పాటులేక
ఇచ్ఛయాగతి ధర్మంబులెల్లఁ జెఱచి
భంగపఱచితకట! మనభారతమును

సీ॥ రాజైన శ్రోత్రియరత్నమ్ము మ్రొక్క వ
లయునంచు బ్రాహ్మణులకు జనమ్ము
లంచు లోకమ్ములో నెంచుగాననియట్టి
యధికారమిచ్చి యన్యాయరీతి
బ్రాహ్మణత్వ మొరులు పడయరాకజనన
మ్మున వచ్చువస్తువంచును వచించి
ఎల్లవారలను వంచించి హరించితె
వారివిప్రత్వము వడయుహక్కు?

గీ॥ సంతతృప్తి గలుగక బ్రాహ్మణుడు దుష్టు
డేని బాలుండయేని నూత్నేంద్ర క్షత్రి
యుని నమస్కృతుల్ పొందగా యోగ్యుడనుచు
ధర్మముంజంపితివి భారతమున నకట

గీ॥ పదియు రెండేండ్ల బ్రాహ్మణ బాలకుండు
ఎనుబదున్నచో క్షత్రియుండె నమస్క-
రింపవలయునన్నచో లోకమెట్లు నిలుచు!
పెద్దలను గణింపని జాతి పెంపుగనునె?

గీ॥ జన్మచేతనె లోకముల్ సర్వములును
మ్రొక్కదగునన్న ఎవ్వాడు పూజ్యతకొఱ
కు జతనమ్ము సలుపు? నెట్టికూళయయ్యు
మ్రొక్కవోదన్న నెవడు సద్బుద్ధి నేర్చు?

గీ॥ కాన బ్రాహ్మణుల్ సేతిరక్షణముకొఱకు
యత్నమొనరించుట నశించె నప్పరీతి
దిద్దుకొనుటయు నశియింపఁ దెవులుఁజెంది
బ్రాహ్మణము నేఁ డేమికిఁ బాలుపడియె

గీ॥ బ్రాహ్మణుల్ సేయుతప్పులు పట్టి శిక్ష
సేయరాదేని వెఱచుచో ఛీ! యటంచుఁ
జెప్పువారలు లేమి రచింపఁజొచ్చి
రేదితోచిన బాపలే యగ్గులేక

గీ॥ అంకుశమ్ము లేనియిభమ్మునట్లు బ్రాహ్మ
ణులకు రాజలోకభయముల్ పోనరకున్కి-
నేచ్ఛవర్తించి దేశమ్ముఁ జీల్చివైవ
రాజలోకమ్ము లంచె నరాజకతను

గీ॥ లోకములకు బూజ్యులయి వేల్పులనఁదగెడి
వారునీతి మాలిసెలంగఁ బ్రబలదేయు
నీతిసర్వసంఘమ్ములందు? దుర్నీతిగల్గు
జాతివశమించుటదియు నాశ్చర్యమగునె?

గీ॥ జన్మచేతనె—నీతియు సత్యమార్గ
మునువిడిచియు బాపండు—పూజ్యుడగుట
అత్తఱి నీతినిగణియింప నరయుడయ్యె
ఇతరులది గడంచియు ఘనతకెక్కఁదగర!

గీ॥ అందుచే ధర్మమొనరించు నట్టికొక్క
జాతిలో జచ్చె; రూపందు సత్యమనగ
నుండు నేనియు పంచముడొందదు కడ
కీర్తి? దుష్టుడై బాపడు కీడుఁగనఁడు!

సీ॥ అగుటచే దేశమ్మునావరించెను కలు
షపరత్వమగుబుద్ధి; సత్యమెడలి
పోయె; నెవరుఁడెట్టి పోకలుపోయిన
"ఇదిమంచి" "ఇదిచెడ్డ" ఏలసేసి
తీపని యనిధర్మ్మవెంచి చెప్పెడువారు
భూమిలో లేకుండ పోవపోవ
జాతికిఁ బెద్దలు నీతిసెప్పెడువారు
లేమి కలహముల లీనమగుడు

ఆ॥ నాడునాటికి గృశియించినాశమంది
భారతమ్మది శాశ్వతపారతంత్ర్య
మందె; అట్టియోగాదె సత్యమ్ములేని
దేశము జగమ్మునందున్నతిఁ గనునొకో?

గీ॥ బాపను తప్పనేయు నిది పాపపుకార్యము దీనిఁజేయగా
నోపునెయంచు శిక్షయిడనోపడక్షత్రియుఁడట్టి క్షత్రియుం
బాపలు తప్పటంచు దగుపద్ధతితో నడలింపలేర! యిం
కేపగిదిఁ బ్రభుత్వము చరింపగనేర్చును ధర్మబద్ధతఁ?

గీ॥ బ్రాహ్మణుండు దుష్టుండుగాదె రాజుఁజంపె
నేనియు నతనిఁజంపుట కెవరుపూన
తగదుగద—బ్రహ్మహత్యయె తనదుననుట!
ఇంకదుష్ట శిక్షణమొనరించుటెట్లు?

సీ॥ రాజ్యమ్మునందలి బ్రాహ్మణుల్ రెండుగా
జీలిన భూపతిచీకుఁగాక
సెప్పనేర్చునొకో యిసీ! యిది తప్పని
రెండుకెలకుల జరించువారు
బాపలేయగుటను బాపని దప్పని
శాసింపగారాజు చాలనికత
మున నద్ది దేశమ్ముఁగొనియెఁ;— బ్రజలకు చా
లక వారిదయఁగోరి వారొసంగు

గీ॥ ఆనలంబట్టి బెదరుటో నవనియేలఁ
బూనురాజు శూద్రుఁడాయె నీపుడమిమీఁదిగ
రాగఁజనెను వృద్ధగతి దుర్భాగ్యుఁడగుచు
ఒరులచేతివాఁడయగుచు నుండుఁగాదె?

గీ॥ అట్లు భారతమునగల్గునట్టి రాజ్య
ములవియంతః కలహములు పొంది చీలి
కలయి జాతీయభావంబు గాంచలేక
బ్రాహ్మణత్వ విషమ్ముచే భస్మమయ్యె

సీ॥ జందెముల్ దాల్చి ద్విజత్వమ్ముగొనినవా
రెల్లవర్ణములలో హెచ్చటంచు
జెప్పుకొంటయు జందెముప్పనివారి సా
లనమున నుంటపాడికాద
టంచుద్విజులు వారికంకితులై నను
స్కారముల్ సేయుటసహ్యభిన్న
మనియు నిట్లెప్పుడుంగనరాని వినరాని
క్రొత్తసిద్ధాంతముల్ కూర్చి బ్రాహ్మ
గీ॥ ణులవి దేశమ్మునందెల్ల నలమఁజేయ—
యజ్ఞసూత్రము దాల్పనియట్టి ప్రభువు
లవ్విసత్యవిరుద్ధము లగుకృతులని
యడ్డుసెప్ప—చీలికలయ్యె నార్యభూమి

గీ॥ ఏకజాతీయతవలయు నేనిద్విజులు
యాజ్ఞసూత్రమ్ము దాల్పని యన్నరులను
పెద్దలుంధార్మికులు విద్యపెద్దయెఱుగు
వారలున్నచో మ్రొక్కఁగావలదె యెందు?

గీ॥ జందెమది తాల్చుట యహంకృతిందలను ధ
రించుటంచు వేదములు వచింపవెందు
నేని; బాపను రక్కసియైన కతన
ద్విజులొరులకు మ్రొక్కరని విధించెఁదాను.

గీ॥ ఎనుబదేండ్ల వృద్ధుఁడగుచు నెసగు గుణిని
ధర్మమూర్తిని సత్యమ్ము తనరువాని
శూద్రుడని వ్రాసి, యట్టి పూజ్యునికి ద్విజకు
మారకుఁడు మ్రొక్కఁడనుటదుర్మార్గమొకఁడ?

గీ॥ పరిభవ యాఁగాక పోషణభారమూని
జీవికనొసంగువాఁడయి చెలగుఁగాక
జందెము ధరింపనతనికి జందెముండు
వాఁడు వేల్పగు ననుటది పాడియగునె?

గీ॥ దేశమెల్లను చీలికల్ తేజరిల్ల
భారతావని యెల్లను భగ్గుమనుచు

రెండుచీలికలై సీమలొండునొకటి
తోడఁబోరి చావంగను దోడరెనకట!

గీ॥ నూలుపోగులు ధరియించి నూఱుహత్య
లు సలిపినను నెట్టిచేడుగులు జనియింప
వతడు రాజశిక్షకుఁ దగనట్టివాఁడె
యనుటకంటె మహాపాపమవనిఁ గలదె?

గీ॥ పాపియగు బాపనికిఁ గొలుపు బరమధర్మ
మంచుఁ జెప్పి పూజ్యులయినయట్టి యొరుల
హీనులనుచు హీనపరచి హీనగతులు
పట్టఁగాజేసితిక్కట! భారతికిని

గీ॥ రెండుచీలికలై యొప్పుచుండుజాతి
నాశమగుటది తప్పదన్న నడిసత్య
మయ్యె బరులక జేయ్యమై పరగునార్య
భూమిపులకు లోబడి పోయెనకట!

గీ॥ బ్రాహ్మణుల దుష్టశాస్త్రాళి ఫలము జాతిఁ
జీలికలఁజేయ నకట! యశేష సంప
దలు నెలఁగు భారతమాపదలు పెనంగ
పారతంత్ర్య ముంజెందె దుర్భరముగాగ

సీ॥ నీకూతునేఁ గొందు నాకూతునీకీయ
నిదిధర్మమనుచు రచించెనవల
పూజ్యులుగ క్షాత్రమ్ము పొసగెడువారు నా
రెడ్లు మొదలగువారిని కొలదుల
టంచు దుష్టమ్ములౌనట్టి స్మృతుల యందు
వ్రాయగాశాస్త్రము పఱలుచుండు
జాతులు విప్రరాక్షసత గ్రహించి పో
రాడగా భారతి దైక్యమెడలె

గీ॥ జంధెములవారు కత్తులుముందునిల్పి
బాపలకులొంగవలదె సర్వప్రపంచ
మనుచు బాపులకుగ లొంగనగు నెయని ద్వి
జేతరులెదుర్పయుద్ధమ్ము సిద్ధమయ్యె

గీ। ద్విజులును ద్విజేతరుల్ పోరపెగుటచూచి
సమయమంచును తలపోసిసమరభూమి
కెక్కివచ్చిరి తురకలెంతేని పెంపు
గనుచు దుదిరాజ్యలక్ష్మిని కాంచిరౌర!

గీ॥ బ్రాహ్మణుని చెడ్డస్మృతుల ధర్మంబులిట్లు
క్షత్రియతను జాతీయతంజంపి పిదప
జాతిహెచ్చుతగ్గులఁజీల్చి సర్వనాశ
నమ్ముకావించెమన యభాగ్యమ్ముకతన

క్షత్రియులకు బ్రాహ్మణ ధర్మానుష్ఠానపు హక్కులును
వైశ్యశూద్రవృత్తులు అవలంబించు హక్కులును
లేవని నిషేధించుట బ్రాహ్మణాని
పచ్నైదవ మహాపాపము.



సీ॥ క్షత్రియులనుచును జనులగొందఱి వేఱు
చేసి బ్రహ్మత్వపుసిద్ధి వేఱు
జన్మఁగందురువారు సత్యమీ జన్మ హ
రిశ్చంద్రుఁడును మహర్షిత్వమంద
జాలఁడ శ్రీరామచక్రవర్తియు దశ
రథుడు మొదలగు వారలు బడయర
బ్రాహ్మణత్వము; నట్ల ప్రథమనమస్కార
మొందఁదగరు క్షత్రియులును విప్రు

గీ॥ నుండి; అనుచును వేదమ్ము లొప్పనట్టి
తప్పుసూత్రముల్ స్మృతులను గొప్పపేరు
పెట్టివ్రాసిలోకమ్ములఁ బిట్టుగాఱి
యలు పొనర్తువే! విప్ర! అన్యాయబద్ధి

సీ॥ క్షత్రియుల్ దేశమ్ము శాసించుప్రభులు
వారు వైశ్యత్వమ్ము వడయరాదె?

భూములంమన్ని సంపూర్ణములగు పాడి
పంటలు పండించి భారతికిని
లోటులేకుండునట్లు కనుల పండువు
గనుసస్య సంపదల్ కరవులేక
యుండునట్లులు క్షత్రియులు పండజేసిన
బాపముల్ జగతికిఁ బండునో కొ

సీ॥ అట్లవాణిజ్యముం జేసి అవనిపతుల
యుద్ధభటులతోచు గొలవగానోపనట్టి
వారు జీవింపఁ బాపము్వఅలునో కొ
ఏల దుష్టపుగ్ర వాతెర చింపవలయు!

గీ॥ మోక్షసిద్ధికి నంతరమ్ములని యనరె
వర్ణములు? మోక్షమీజన్మఁ బడయవలయు
నంచుఁ జెప్పవే శ్రుతులు? మోక్షార్థులకును
బ్రాహ్మణత నిషేధింతువీ పాపమేల?

గీ॥ వర్ణముల్ నాల్గు నొకని పావనములగు ద
శలుకదా? వానిగడచి దుస్సాధ్యమైన
మోక్ష మీజన్మలో బొందబోలుననుచు
బ్రాహ్మణత నొసగెఁగద యీశ్వరుడు ప్రజకు?

గీ॥ దేవుఁడిచ్చిన వరమున కీవయడ్డు
పడగజెల్లునే రాక్షసభావమూని

రామచంద్రాదులేనియు బ్రాహ్మణత్వ
మందరాదని యనరా కో! స్వార్థమతిని?

వైశ్యులకు బ్రాహ్మణ ధర్మానుష్ఠానపు హక్కులును క్షత్రియ
శూద్రవృత్తులు అవలంబించు హక్కులును లేవనుట
బ్రాహ్మణుని పడునాలవ మహాపాపము.



గీ॥ పరమపూజ్యులై నిను నిరంతరము గొల్చు
వైశ్యులకును ద్రోహమ్ము భావమ్మునందు
నెంచగాదగునో కొక్క పూజించువారి
కెగ్గుగావించు బాపలకేమి ఫలమొ!

సీ॥ కూతుఁ బెండిలియని కోరుచో నీకునూ
ట పదాఱులిచ్చునడ్డంబు లేక
బిడ్డకు పడుగని బ్రొద్దయునర్థింప
వ్యయమిచ్చి నీకు బ్రాహ్మణత నిల్పు
ఇల్లులేదని వేడ నెంతయుఁ బ్రీతివ
హించి భవనము కట్టించియిచ్చు
మఱియు నెన్నేని సమయముల సంతర్ప
ణలును సమారాధనలు నటంచు

గీ వేలకొలదిగ విప్రులబిలిచి వేల
కొలదిరూప్యముల్ వెచ్చించి కూర్మినీకు

షడ్రసోపేత ముగవిందు సలుపు నట్టి
వైశ్య ద్రోహ మ్మెనర్చుటేవలననగును?

గీ॥ నీకు నెల్లభంగుల నింతని వచియింప
రాని మేలుసేసెడు నట్టివానికేని
ద్రోహ మెంచకుండుట దోపరాని
విషయమయ్యెను కాబోలు! విప్ర! నీకు

గీ॥ బ్రాహ్మణత్వంబు పొందగా వలవదనుట
పరుల మోక్షంబు వేఱొకభవమునందు
పొందుడని చెప్పుటయు నిన్నుఁ బూజసలిపి
వైశ్యుఁడందు లోకోత్తర వస్తువిదియె!

గీ॥ క్షత్రియత్వమ్ము నొందగాఁ జాలరనుచు
వైశ్యనరులను దుష్టమౌ భావమునను
క్షాత్రహీనులుగాఁ జేయఁజాలుదొక్కొ?
గాంధి మించెడు క్షత్రియుల్ కలరెజగతి?

సీ॥ రక్తంపు బొట్టొండు రాల్పకుండనె భార
తమ్మెల్ల శాంతియుద్ధమ్ము కొల్పి
ఆస్మదేశీయులయందు స్వరాజ్య సం
పాదన బద్ధిని పాదుకొలిపి

ప్రభువులందో నెల్ల ప్రభువని మాన్యత
గాంచిన యద్వీను గౌరవమ్ము
గాంచి, సంధిసలుప గాంక్షించు భారత
చక్రవర్తి విలువు సంతరించి

గీ॥ శాంతి యుద్ధదేవతయన్న శాశ్వత ప్ర
తిష్ఠ సకల భూములగొన్న ధీరు గాంధిఁ
గన్న వైశ్యకులమ్ములో క్షాత్రముండ
దే? యది నిషేధమ్ము సలుపనేల చెపుము!

గీ॥ వైశ్యుఁడు సమరంబు సలుపఁ బాపమనుచు
గాంధిదేవుడు దేశరక్షణము సేయ
శాంతియుద్ధంబు పూనికసల్పడేని
భారతిగతి ఏమగు నొకో? బ్రాహ్మణుండ!

గీ॥ బ్రాహ్మణత్వమ్ము లోకమ్ము వారికెల్ల
విషమువోయు బ్రహ్మాండమౌ విసపుచెట్టు
కాలకూట మద్దానిచేఁ గలుగు మేలు
లేదు సర్వమ్ము కీడెఫలించుచుండు

గీ॥ ఆత్మదేశపు స్వాతంత్ర్యమదినశించు
యుద్ధమబ్బుచో నేనని యొక్కమొగిని
బంచములు బ్రాహ్మణులు నెల్లవారు సమర
భూమిఁ జేరిజాతికొఱకు బోరవలదె?

గీ॥ ఏల యట్టిధర్మము క్షత్రియాళికిచ్చి
పెరలు దేశరక్షణకయి ప్రీతిఁబ్రాణ
ములు విడువగ యుద్ధభటతఁ బొందరాన
టంచు శాసింతువిట్టు లన్యాయరీతి?

గీ॥ శాంతియుద్ధంబు వైశ్యంపుసలుప కున్న
భారతావని క్షత్రియత్వంబుకలదె!
రణముచే క్షత్రియుడగుచు గొప్పనందు
వాడుకాక క్షత్రియుపేరు వాడుగొప్ప?

గీ॥ క్షత్రియులయును క్షత్రియశక్తి కల్గు
నేని గాంధిశాంతి సమర మేలక్షత్రి
యజనము లనగదగువారలరసి చేర
కుంద్రు? నీశాసనము తప్పకున్నె నేడు?

గీ॥ ఆత్మకులరక్షణమ్ములో నరసి జంతు
జాలములు బరులఁగవిసి చంపుచుండు
నట్టిచో క్షత్రియతలేక అన్యదాసు
లగుడనుచుఁ బ్రజలకు చెప్పవగు నెనీకు?

గీ॥ సర్వజనులలో వెలసెడు క్షత్రియతను
జంపి దేశమ్ము పరుల హస్తంబులందు
పెట్టియును సనాతనుడవన్ పేరుతాల్చి
పాప బోధలు సేయఁగా పాడిగాగునె?

18 కోట్ల ప్రజలకు అశాస్త్రీయముగా శూద్రులను పేరు పెట్టుట, వారికి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య ధర్మములు అనుష్ఠించు హక్కులు లేవనియు ప్రథమ సమ స్కారార్హత లేదనియు నిషేధించుటయు బ్రాహ్మణుని పదునేడవ మహాపాపము.



గీ॥ శూద్రులను పేరుబెట్టి పూజ్యులగువారి
బల్వగానొనె పాపంపు బిలుపునకట!
బాల్యదశయందు వెలసెడువాడుకాడె
శూద్రి? డొరునట్లనుట దుష్టసూక్తికాదె?

సీ॥ శోకమ్ముచే నెప్డు శుష్కించురనియెడు
నర్థమ్ము నెంచి నీవనుదెయిట్లు?
నీసుచెంగటంజేరి పాదమ్ములొత్తగా
నైన వారని యెంచియనుదొయిట్లు?
ప్లీడరులై ప్రజల్ పీడించు నీవారి
సత్యమొప్పదటంచు సత్యపరుల
నిట్లు పిలిచెదొ! ఏమెంచితో! నీవిట్లు
పదియు నెన్మిదికోట్ల ప్రజలంబూని!

గీ॥ శూద్రులనుపేరం బిల్వంగాజూతు వకట!
ఎట్లు బ్రాహ్మణతను ధరియింపనర్హు

డవయి యొప్పుదీ! వెలు శూద్రులవుదువొక్కొ
క్షాత్రముఁ సత్యముఁ గల్గు జనములకట!

సీ॥ రాజాధిరాజులై పూజనీయగుణంబు
లొప్పి జగములేలుచుండువారు
కోట్లకొలందిగ గూడిన ధనరాసు
లర్థులకిడి త్రినస్సైనవారు
లక్షలకొలది పొలములొప్పగా జమీం
దారులై సత్యమ్ము తనరువారు
పదులునిర్వదులు నేబదులుగా నెకరముల్
దున్ని పండించి సంతుష్టినిన్ను

గీ॥ మంచు వారు శూద్రులగుదురంచు నకట!
వేదములకు దుష్టార్థముల్ విప్పిసెప్పి
ద్రోహ మొనరింతే? లవమేని దుష్టరీతి
కనని వారలు బ్రాహ్మణులనగ దగరె

గీ॥ పదియు నెన్మిదికోటులు ప్రబలుచుందు
రట్టివారి శూద్రులనుచు నక్కటకట
పిల్వగానీవు సత్యమ్ము పెంపుసెలిసె
పలుకు మేపాటివాడవై పరగుదీవు?

సీ॥ హూద్రులనుచుదిట్టుచునువారి కొల్వులో
జీవితమ్మదియమ్మి జీవికగొని

బ్రిదుకును సిగ్గింతపాటియుంగనక స్వే
చ్ఛలనంట దగదని చూడరాని
వారని చెప్పుచు వారిఁజేరి శరీర
మమ్మి భృతినిగొని ఆకలియును
దప్పిదీర్చుకొనుట కొప్పును నీతి ర
హితగతి; నిట్లు రచింపరాని

గీ॥ నీచసేవలు కావింతు నీదుధర్మ
శాస్త్రముల చెడు వ్రాతలాచరణ నుంప
వీవ; యితరులాపాపమ్ము లెఱిగి యాచ
రింత్రె? పరులకొఱక రచియించితొకో?

ఆఱుకోట్ల ప్రజలను పంచములని చండాలురని పేర్లుపెట్టి నాడు సృష్టి అంతమువఱకు గ్రామబాహ్యులు సంఘబాహ్యులు అయియుండవలయునని శాసించుట బ్రాహ్మణుని పదునెనిమిదవ మహాపాపము.



సీ॥ నీదుగాహిత్రిలు నీకుకావించిన
పాపంబులేశమ్ము చూపకయు మ
హాపాపివై వారలాచంద్రతారార్క
ముం గ్రామబాహ్యులై—పూజ్యగుణులు

విద్యా వివేకముల్ వెలయువారయినను—
సంఘబాహ్యులగుట శాస్త్రమొప్ప
ననుచు నీశ్వరునర్థ మదెయంచు శృతులక
పార్థముల్ సెప్పియపారమయిన

గీ॥ ద్రోహముం జల్పిమదిజంకుతోపకవల
యది సనాతనమని సత్యమనియు ధర్మ
మనియు యెల్లలోకమ్ములు నాచరింప
వలయుననుట పాపముకాదె బ్రాహ్మణుండ!

ఉ॥ ఉత్తములైన వారలకు నొక్కక్షణంబగు గోపమాపయిఁ
చిత్తమునందు కీడుగొనం జెల్లదటంచును చెప్పశాస్త్ర మీ
తత్తరపాటులేకయుఋతమ్మును తప్పుచు కూతుబిడ్డలఁ
కుత్తుకగోతె? సంఘమునకుఁ వెలివారని చెప్పియక్కటా

గీ॥ పూజ్యులగు హరిజనులకు బుద్ధి పూర్వ
కముగ నీసలిపెడివెలికాదె పదునె
నిమిదవ కలుష? మీకృతి నీవువిడిచి
అగుము! సద్బ్రాహ్మణుండవు యశముకలుగు.

అష్టాదశ మహాపాపియగు బ్రాహ్మణునితో సద్బ్రాహ్మణులు,
క్షత్రియులు, వైశ్యులు శూద్రులనువారు,
సంపదలుగలవారు సాహాయ్య నిరా
కరణ మొనర్పవలయును.



గీ॥ బాపడిట్టు లష్టాదశ పాపియగుట
నతనితో బొందుతగదు పయస్సునందు
విషముచేరిన నవియెల్ల విసమయగుచుఁ
బ్రాణముల్ తీయ వేయెట్టివాని కేని?

గీ॥ బ్రాహ్మణతయది యసురధర్మంబయగుట
ఒరుల మేలోర్వ దెంతయు విరసగతి ని
తరుల సర్వమ్ము హరియింప నరయుచుండు
నింతతథ్యంబు పొల్లురవ్వంత లేదు

సీ॥ బ్రాహ్మణధర్మంబు బడయగారాదంచు
పరుల మోక్షము చెఱుపగదలంచు
వేదమ్ము పఠియించి వేడ్కతో బోధింప
దగదంచు దానిపేక్షమ్ము సేయు
తపము కావించుట తగనికార్యమ్మని
ఇతరుల తపము హరించివైచు

అస్పృశ్యుఁడవయి గర్భాలయమున బూజ
సలుపంగ దగవని పలుకునవల

గీ॥ అట్లు బిడ్డలదఱిఁ జేర్పనరయు పరము
పితకు సడ్డంబుగానిల్చి పెద్దయు వెస
గూర్చి గర్భగుడికిఁ జేరగోరు భక్తు
లను నిషేధించునకట బాపని మహిమ్మ

సీ॥ తొలినమస్కృతి జెందవలయు బాపఁడొకండ
సలుపడాతఁడు దాని క్షత్రియులకును
వైశ్యులకును ధర్మవర్తనులౌ శూద్ర
వరులకు పూజ్యులౌ పంచములకు
పాపియయ్యునతండ పరమపూజ్యుండయి
వేదమెఱుగు నోరు విబుధుకంటె
మాన్యుడంచు నోరుల మాన్యత దగ్గించి
బాపనికది సమర్పణము సేయు

గీ॥ అట్టి సంబోధనల నెటి యనఘుఁడేని
—బాపనింటను పుట్టని పాపమునను—
అయ్య!, ఆచార్య! యని పిల్వ నర్హతకన
డంచు నెల్లవారల నిషేధించునద్ది

సీ॥ సినఁజూడనాడు భోజనముమైలగు నని
నాల్గువర్ణముల నెన్నంగబూను

నినునంట నామూర్తి కనెఘమైలయనిప
    ర్వజనుల నకట! దూరమ్ముతోలు
పంచముల్ శూద్రులు పరిషత్తులకు వచ్చి
    యధ్యక్షత కనరాదనుచుఁ బలుకు
సహపంక్తి భుజయింపజాలరె వ్వారును
    కోరరాదయ్యది కూళతనము

గీ॥ మీకొమరితెలం బెండ్లాడనాకు దగును
నాకొమరితే బెండ్లాడు టన్యాయమగు న
టంచు నివి దైవసమ్మతు లంచుచెప్పి
నిన్ను నెన్నెన్నెయురులలో పన్నితుంచు

సీ॥ ఆన్యవర్ణపు స్త్రీలనైన విడువక దోహ
    హము సేసి పురుషులహక్కు లంద
దగదు మీకంచును తెగడివారల బ్రాహ్మ
    ణత హరియించి దుర్ణయముతోడ
వంచించు; బ్రాహ్మణత్వమ్ము పూనెడి హక్కు
    ధర్మశాస్త్రరచన ధర్మ నిర్ణ
యమ్ములు తనకు సొత్తంచు నితరులు ము
    ట్టఁగదగ దనివల్కుటక్కరియయి

గీ॥ వానిగాని స్మృతులనుపేర కానిధర్మ
ములు రచించి చట్టమ్ములు సలుపుహక్కు

లితరులకు లేకయుండ హరించి మించి
దేశమేల నెపుడు ప్రయత్నించునతడు

సీ॥ క్షాత్రిమ్ము భారత జనుల సొత్తయియుండ
నది క్షత్రియుని ధనమంచు దాని
గొందఱికిడి లోకమందు నెవ్వారును
దాని గొనమికడు ధర్మమంచు
నట్లు వైశ్యతందనకైన కొందఱికిచ్చి
యొరులు సేద్యము సేయుటొప్పదనుచు
ఇట్లుపుడమింగల్గు నెల్లవారికి మోస
మొంతేని జేసి హింసించితాన

గీ॥ సృష్టికెల్లను రాజని ఈశుడేని
తనదుమంత్రులనె యుండితనకుంగూర్చు
భటుడయ్యెయుండు ననుచును భయములేక
పలుకు నీశ్వరద్రోహియా బ్రాహ్మణుండు!

గీ॥ పదియు నెన్మిది కోటులప్రజల నవల
శూద్రులనియును వారుద్విజులకు సేవ
సేయుటయ పాడియంచును జెప్పివారి
మోక్షహీనుల గావింపబూనునతడు

గీ॥ అంత్యజులు, పాపులనుపేర్ల నాఱుకోట్ల
జనులఁబిలిచి సృష్టి తుదిని గనెడువఱకు

సకల గ్రామదూరులని పాపాత్ములనియు
నాశ మొనరించునతడు దుర్ణయముతోడ

గీ॥ గానబాపని దఱిజేరగాదుమనకు
ఎపుడుదఱిజేర్తుమో వార లపుడమనల
ద్రొక్కి తామె హెచ్చించును ద్రోసిపుచ్చి
బాధలొనరింతురివారి స్వభావమద్ది!

నేటి బ్రాహ్మణ రాజకీయవేత్తల వాగ్దానములును
సత్యములు కావు.



గీ॥ రాజకీయమ్ము చర్చించు బ్రాహ్మణుండు
సేయుమోసమ్ము మఱియును జిత్రి మరయ
తాను సంస్కారపరునట్లు తలచుబల్కు
బ్రాహ్మణులకది బోధింప బాలుపడడు

సీ॥ గుడికి మమ్ములనర్చకుండు రానీయడ
యన్నచో గుడియేల? యనుచుఁబల్కు
చూచిన మైలంచు వేఁచును బ్రాహ్మణుం
డన్నఛాందసులు వారంచుఁ జెప్పు
అంటినమైలాయె ననుచు మమ్ములఁదిట్టె
నన్న స్వల్పవిషయ మనుచు సర్దు

ఇంటిలో దనకును ఇంటి వెలుపల ని
తరులకు వర్ణింపదప్పటంచు

గీ॥ చెప్పఁజాలక యాచార మెప్పగిదిని
ఒక్కతూరిగ పోగొట్ట నొప్పుమనకు?
అంచు బ్రాహ్మణేతరులైన యట్టి శిష్యు
లకు సమాధానమెటులొ పల్కంగ నేర్చు

॥ తప్పులివి దిద్దుకొనుఁడంచుఁ దాను బ్రాహ్మ
ణులను బిల్చి సభలు సేసి పలుకఁడొక్క
నారియైనను వారలు సలుపుపనులు
బాపలకు నున్నతి నిడునట్టి భావమెంచి

సీ॥ అన్నమ్ము భుజయించి నట్టివి స్తర్ల్వఁ దా
మెత్తింప నద్దువచింపఁ బోడు
పేడతో నలికింప వేడుకగాఁ జూచు
తప్పని చెప్పి యదల్పఁబోడు
గర్భగుడులకు బోగాదని చెప్పగా
నాచారముల్ విడనగునె? యనును
బ్రాహ్మణకన్యలం బాణిగ్రహణము వే
దోక్తమ్ముగా సల్పుతో ప్రవశాస

గీ॥ నమ్ముమార్పగవలయు నన్న నది యనవ
సరముకాదె రెజిష్టరు సరణిఁ బెండ్లి

సలుపుకొనరాదె? యనుచు సంస్కర్త వోలె
పల్కుచుఁ బ్రాహ్మణత నిల్పఁ బాటువడును

గీ॥ బ్రాహ్మణులు సేయుపాపముల్ పదియు నెన్ని
వెఱిగియుండియు వారిరావించి యొక మ
హాసభఁ జేసి తెలియుసత్యమును చెప్పి
దిద్దుకొండని యేని బోధింపడతడు

గీ॥ బాపనింటి వెలుపలనే బాధలేక
బ్రాహ్మణేతరుల్ భుజియింప బహులగౌర
వమ్ము బాపలకొనను భావమాత్మఁ
దెలిసి సంస్కర్త యుంబోలె తిట్టునురక!

గీ॥ బాపఁడొకనాఁడుఁ బూజ్యులౌ బ్రాహ్మణేత
రుల గృహములను కుడువ వెడలకయుంట
బ్రాహ్మణుల యున్నతికె తోడుపడెను నంచు
నెఱిగి సంస్కర్తగతిని నటించుచుండు

గీ॥ అర్చకులగుటకు తగినయట్టి శిక్ష
నేర్పు పాఠశాలలు కొన్ని నిల్పి యందు
వర్ణములను బంచములను వారిఁ జేర్చి
నర్చకులుగాగ జేయమేలన్న విసువు!

గీ॥ రాష్ట్రపాలురకీయగా రాదయట్టి
హక్కులయ్యవి ప్రజలవైయలరవలయు
నంచు బల్కి సంస్కారమ్ము లంతరించు
మంచి మాటలు చెప్పిముగించుచుండు

గీ॥ తనదువర్ణమ్ము తెలిసి యితరుల కెపుడు
సేయునపకృతి తొలగించు సేవకంటె
యోగ్యమగుసేవ లేదను టొప్పుకొనును
కాని బాపలసంస్కృతిం బూన డతడు

గీ॥ బ్రాహ్మణేతరుల్ వేర్వేరు వారలనుట
యెఱిగివారెల్ల రేకీభవింపరనుచు
నాత్మదలంచి కాలోచితమైన పలుకుఁ
బలికి బ్రాహ్మణ సంస్కృతిఁ వదలివైచు

గీ॥ బ్రాహ్మణుల పదునెన్మిది పాపములను
పాపములయయ్యు నిహమునఁ బరమమైన
స్థానమవ్వారికిచ్చునన్ సంబరమ్ము
లోనఁజెంది, అన్యమ్మువల్కుచుఁ జెలంగు

గీ॥ బాపలను కాదనన్ తన్ను బ్రహ్మరథము
పట్టి పూజింపరని గారవమ్ము కల్మి

నెన్నికలందోడు పడరని యెంచియిట్లు
రెండునాల్కల చరియించుచుండు నతడు

సీ॥ ఎన్నికల్ వచ్చెం గావింపుడు సాయమం
చును వేడుంగాని పూజ్యులగు బ్రాహ్మ
ణేతరుల పదియు నెన్మిది హక్కుల
నుద్ధరించెదనంచు నొప్పుకొనడు
అట్టి కార్యక్రమ మాతడు ప్రకటింప
డవియెల్ల నిష్టమ్ము లాత్మకగుట
జాతీయత నిలుప సర్వయత్నమ్ములు
సేయుదునను—నిర్వచింపం దలంపం

గీ॥ డట్టి జాతీయతను సృజియింపనెంచు
వాడొ? ఇట్టు మోసపుబల్కు.. వలికియెట్లొ
శాసనసభలజేరి విశ్వాసమెడలి
బ్రాహ్మణత్వంబ నిలుపగా బాటుపడును!

సీ॥ బ్రాహ్మణకన్యకల్ బ్రాహ్మణేతరులు వే
దోక్తముగ వివాహ మొనరుచు కొను
శాసనమును ఢిల్లి సభయందు చేయింప
నంగీకృతి నొసంగ నాత్మందలప
డట్ల యర్చకత బ్రాహ్మణులుకానిజనమ్ము
లందగానను వైనయట్టి పాత

శాలలు స్థాపింప సలుపుయత్నమ్ముల
కంగీకృతిం దెల్పకడ్డువడును
గీ॥ బ్రాహ్మణుల యందు దేశసేవలు రచించు
రాజకీయ వేత్తలకు స్వరాజ్యమన్న
బ్రాహ్మణుల రాజ్యమనియెడి భావమస్తి
చావలేదనుచెల్లను సత్యమరయ!

గీ॥ రాష్ట్రశాసనసభలకు బ్రాహ్మణులనె
నిల్పనెంచు నితరులగణింప దతడు
జందెపుంబోగుకల్గినజాలు! దేశ
భక్తులైవఱలు పరులుపనికిరారు

గీ॥ ఢిల్లిసభకు "సభ్యగుణా" నెల్లవారు
బ్రాహ్మణులయి యుండంగ తాను బాటుపడును—
తప్పకున్న నొకరినో యిద్దరినో అక్క
డక్కడ నిలుపుచేసమాటం జక్కంజేసి

గీ॥ అక్కడక్కడ నిల్పినయట్టి బ్రాహ్మ
ణేతరాభ్యర్థి కేనియు స్వేచ్ఛలేమ
బ్రాహ్మణుల యిచ్ఛయెఱిగి ప్రవర్తనమ్ము
సేయుటకె శాసనసభకుం జీరిపంపు

గీ॥ ఇల్లుభారతిబాపల ఏలుబడికి
వచ్చు జతనమ్ములు సలిపి బ్రాహ్మణేత
రులగు శిష్యుల నెట్లొ సర్దుకొనుచు తెలి
వి మెయివిప్రరాజ్యంబు కావించుఁ బుడమి

గీ॥ అరయ శ్రోత్రియుకంటె బ్రాహ్మణుల రాజ
కీయ వేత్తయే కడుఁగీడు సేయువాడు
శ్రోత్రియుడు తోఁచినదివల్కు రూఢిగాగ
రాజకీయజ్ఞుడది దాఁచుఁ బ్రౌఢిమముగ

గీ॥ అగుట దూరస్థుడై యుండునట్టి శ్రోత్రి
యుండు కావించుహాని లేకుండు మనకు
మనలగూడి సంస్కారపూర్ణ మాటలాడి
క్రియలనది యాచరింపమికీడుగాదె?

గీ॥ బాపల పదియు నెన్మిది పాపములను
తొలగజేయుబాసయిడి యాపలుకుతోన
సంస్కృతిసలుపు విప్రశాసనసభలకు
బంపుఁడన్యుల బంపఁగావలదు మీకు

గీ॥ ఒక్క*తహాసీలున వసించుచుండు బాప
లను బిలిచి సమ్మతిగ శూద్రుల మఱిఁ బంచ

---

*తహాసీలు అనగా ఒక తాలూకా.

ములను పడమటింటనుగూడి భోజనమ్ము
సలుపఁజేయు విప్రులనెన్నవలయు మీరు

గీ॥ విప్రకన్యల నితరులు వేదమార్గ
ముగ వివాహమ్ము కావింపదగునటన్న
శాసనట్టి సంస్కర్తచే బలుకజేసి
శాసనసభకు బంపుట చాలమేలు

గీ॥ తక్కబాపలం బంపుట తగదుమీకు
పలుకులెన్నియో విధములబల్కి సంస్కృ
తిం దలంపని విప్రులు తీర్చలేరు
భారతికినేడుగల్గు విపత్తులెల్ల

గీ॥ భారతమ్మది శారీరబాధ సెంది
తనువుకుల్లి కంపెత్తి విధ్వంసమాయె
నైక్యమిసుమంత కన్పట్ట దార్యభూమి
ఇంక నెన్నాళులిట్లు జీవింపగలము?

గీ॥ వర్ణములు నాల్గునాలుగై వఱలుచుండ
ఐక్యమెట్టులుగల్గు రవ్వంతయేని
అంటుటయు జూచుటయు మైలయనెడువిప్రి
క్షత్రియాదులు పూజలు సలుపగలరె?

గీ॥ బ్రాహ్మణునిచేత భారత రాజకీయ
మెల్ల నేడు గలద యని ఎఱిగి పదియు
నెనిమిది యఘములను విడిపింప జేసి
బాపలన్ సంస్కరింప శుభమ్ములబ్బు

గీ॥ భారతికిగల ఛిద్రముల్ బాసిపోవు
భరతమాత తనువులోని బాధతొలగు
ఐక్యమబ్బును సంతోషమతిశయింప
నేక జాతియై భారతియెసగుభువిని

గీ॥ రాజకీయజ్ఞుడై క్రొలు బ్రాహ్మణుండ
దీని సంస్కరింపఁగలుగు ధీరుడౌరుల
సంస్కృతికిని బ్రాహ్మణులు లక్ష్యము సలుపరు!
గాంధి నేతిట్టు బ్రాహ్మణుల్ కలరుగావె?

గీ॥ గాంధిదేవుని లక్ష్యమ్ముగాగ గనని
బాపలోరులను గణియించువారె తెలిసి?
వారిసంస్కరింపగదగువారు బ్రాహ్మ
ణుల;పరుల సూక్తులనువారు తెలియరకట!

గీ॥ విప్రరాజకీయజ్ఞులీవిధ మెఱింగి
ఆత్మసంఘమ్ము సవరించియవల ఇతర

సంఘములు సంస్కరించి రక్షింపవలయు
భారతమ్ము నంతర్వర్ణ బాధనుండి

అష్టాదశ మహాపాపియగు బ్రాహ్మణునకు బ్రాహ్మణేతర
హిందువులు నమస్కరింపరాదు.



గీ॥ ఎవఁడు నీతండ్రి తాతలు వృద్ధులేని
పూజ సేయఁడో? వారలు పూజ్యులగుట
యెఱిఁగియు నతని మ్రొక్కఁగా నరయుకంటె
నీచతయుగలదె జగతి నిజమెఱుంగ

గీ॥ గుణములలో విద్యలందును కొలదియయ్యు
వయసునం బిన్నయయ్యును "బ్రాహ్మణుండ
నాకు మ్రొక్కఁగాదగు" నను నరుని మ్రొక్కు
టెల్ల జాతినాశమ్ము కావించుటగును.

గీ॥ పెద్దయె పూజ్యుడేని రచింపవలయు
అంజలి; నతడు చండాలుడ నెడి వాడ
యేని బాపడయేని గణింపరాద
కులము; దానిచే చెడుసమకూడుమనకు

గీ॥ బాపడీ ధర్మ వెఱిఁగియుఁ బ్రాహ్మణునకె
ఒరులు మ్రొక్కఁగా నొప్పగు నొరులకతడు

మ్రొక్కడంచును బలికి యపూర్వనీతి
భారతమ్మునన్ నిల్పను బాపియగుచు

గీ॥ దాని నంగీకరింప విధ్వంసమగును
ఐక్య;మద్ది ధర్మముజంపువది యగుటను
కాన బ్రాహ్మణనీతి రాక్షసికమనుచు
విడిచి మ్రొక్కుడు గుణములు వెలయునరుని

గీ॥ మనల తండ్రుల తాతలమాన్యులనుచు
బాపలెల్లరు సభ సేసి పంచములను
శూద్రులను భేదమువిడిచి శుద్ధులగుచు
మ్రొక్కగా నేర్వ బాపలమ్రొక్కుడీరు

గీ॥ ఎంతవఱకు బ్రాహ్మణులు కావింపరట్టి
దీరుమానమ్ములంతకు మీరునతని
మ్రొక్కగావలవదుసుడీ! పూజ్యులార
అట్టి సేతలుగౌరవ హానికూర్చు

అష్టాదశ మహాపాపియగు బ్రాహ్మణునింట బ్రాహ్మణేతర
హిందువులు భుజింపరాదు.



సీ॥ నినుజూచిభక్తితో నిలిపియింటికిఁబిల్చి
స్నానంబు సేయించి సరసఁజేరి

ఈసునిరూపుగనెన్ని యతిథియంచు
నెంచితన పడమటింటఁజేర్చి
తానునఁగూర్చుండితనకుగల కొలది
యేని ప్రేమమెయి వడ్డింపఁజేసి
తనదుబంధువ్రునట్లు కని తోడఁగుడుచుచు
ఆప్రునట్టుల నీకునన్నమిడినఁ

గీ॥ దప్ప బాపనింట భుజింప నొప్పుకొనకు
మింటివిలుపల భుజియించు టెల్లనీకు
మానహాని; యట్టి కృతికి బూనుదేని
నిన్ను నీచునిగాఁగ గణించునతఁడు

గీ॥ బాపలెల్లరు భుజియించువఱకునుంచి
యవలవడ్డించుఁ గూడు నీ అలుసు నెఱిగి
విస్తరాకుల నెత్తించు విఘువడంత
చేడనలికించు కూలికి పెట్టినట్లు

గీ॥ పడమటింటను నీతోడఁ బావనమని
భోజనము సేయఁదలచు విప్రునిగృహమున
నారగింపు మొరునియింట నారగించు
టెల్ల నీదుగౌరవము తగ్గించుకొనుటె

బ్రాహ్మణుని మీ దేవాలయములో అర్చకుడుగా
నుండకుండ జేయుడు.



గీ॥ దేవుడెల్లరి తండ్రియన్ భావమెఱిగి
తనదుఘనత తగ్గుననుచు తప్పుదారి
పట్టకొంటకు దాఁదొంగ విప్రుండునీకు
అర్చకుండగుటది సేనుమగునె తలప

గీ॥ ఈశునర్చింపగాగుడి ఈవుకట్టు
టెఱిగియును గర్భగుడిలోని కేగి పూజ
సలుపనొప్పని విప్రునర్చకుని సేఁత
కొఱివిచే నకట తలనుగోకికొనుటె!

గీ॥ బోగమాండ్రతో పొద్దులు పుచ్చునట్టి
బాపనికొడు కర్చకుడయి పావనముగు
గుడిని మైలసేయుటకంటె గుణము విద్య
యెసగునొరు నర్చకునిగ గావింపరాదె?

గీ॥ తనకడకువచ్చు బిడ్డలతఱిమివైచు
పాపియర్చకత్వము తనపాలబడియె
నంచు గంటనీరిడు దేవునరసివైన
బ్రాహ్మణుని యర్చకత్వమ్ము బాపవలయు

గీ॥ ఆరుకోటుల సోదరులంత్యజులని
పాపులుమఱి జండాలురఁ బాపపుపిలు
పులను బిల్చుచుగుడులకు బోవనొప్ప
కొనని విప్రదర్చకుడు కాజనునెమీాకు?

గీ॥ అతని యర్చకత్వమ్ము విషాన్నమట్లు
విడువదగు మహేశ్వరునుండి వెడలఁద్రోసి
కోట్లమనుజుల మోక్షమ్ముకూలద్రోయు
నతడు ఈశునర్చకు నెట్లులర్హుడగును?

గీ॥ అట్టివానిని నీగుడి కర్చకునిగ
నిలుపుదేనియు బాపిగానిన్ను జేయు-
ఇతడు పంచముడీతని నీశుకడకు
చేరనీయకు మంచువచించునీకు

గీ॥ అట్లునీదుగుడిని క్షత్రియాదులేని
గర్భగుడికి బోవుటది జగత్పతికిని
అంటుగల్గించునంచు నేర్పలరఁజెప్పి
ఈశుదఱిజేరకుండ గావించునిన్ను

గీ॥ మధ్యఁజేరితా నాగమమంత్రములను
దొంగమంత్రములు వచించి డొంగిలించు
నీదు మోక్షమ్ము;నతడు వర్ణింపరాని
మోసకాడగు నెట్లు విప్రుడనఁదగునా!

గీ॥ కాన మీదు మోక్షమ్ములు గంగగలుపు
పాపికర్చకత్వము నీయ బాపమగును
అతని నీగుడినుండ నీయంగరాదు
తఱిమి వైవుము కారణ మెఱుగ జెప్పి

గీ। పంచములను శూద్రులను గర్భగుడి కేని
జేర్చి స్వయముగా పూజించి సిద్ధినొంద
నొప్పుకొనెడి సద్బ్రాహ్మణు నుంపుమర్చ
కత్వమునకది నీకు మోక్షంబునొసఁగు

గీ॥ కనుల నీర్వెట్టికొడుకుల గాంచలేక
కుందు నీశునింగాంచియుఁ గూళయగుచు
వెలియొనర్చెదు బాపనివిడువకున్కి
వంశహానికి హేతువై వరలుఁజూవె

గీ॥ కోట్లజనులఁ బంచములని గుడికి వెలుప
లను నిలిపియట్లు వర్ణముల జనములను
గర్భగుడికి రానీక మోక్షంబు దొంగి
లించు నతని కీడునిను హరింపకున్నె?

గీ॥ తొలుత నీచేత నెటో పంచములను వెలి యొ
నర్పఁజేసి యా వెనుకవర్ణములవారి
గర్భగుడికి రాకుండ బల్కుంగ జేసి
పాపిగా జేయు నినుగడు ప్రీతిభతోడ

గీ॥ ఇతరజనుల మోక్షము నిరోధించు పనులు
వంశహానిఁ గావింపవే వలచియెట్టు
లచ్చికత పాపియయిన బ్రాహ్మణుని కిచ్చి
వంశహానిని తెచ్చుకోవలతువీవు?

గీ॥ వెలియొనర్చితినేఁ బంచములనటంచు
కౌతుకము నర్చుకుము సెందుఁ గాని దేవు
నే వెలియొనర్చితినటంచు నెఱుగఁడకట!
ఎంతమూర్ఖుఁడో అర్చకుఁడెంచి చూడ

సీ॥ ఇతను పంచముడంచు నితడు మ్లేచ్ఛుడటంచు
నితడు శూద్రుడటంచు నెంచఁ జనక
ఇతడు గర్భగుడికి నేగదగు నితడు
గర్భగుడికి బోవగాదటంచు
నెంచగాఁ జోకయ యెంతేని భక్తితోఁ
జేరవచ్చెడివారిఁ జేరదీసి
పూజ్యుడౌ నీశుని మ్రొక్కి పాపమ్ములు
చెప్పియతని రక్షసెంది మోక్ష

గీ॥ మందుకొందుఱకెల్ల వారల నాలయముల
కేగ నిచ్చెడి పూజ్యులనేరి యర్చ
కులుగ గావించుటయ్యాని గుడులుకల్లు
నందులకు ఫలమన్యంబు లఘుము లగును

అష్టాదశ మహాపాపియగు బ్రాహ్మణుని బ్రహ్మ క్షత్రియ
వైశ్య శూద్రులు పురోహితునిగా నుంచుకొనరాదు,



సీ॥ నినుజూడ మైలగునని దూఱువాడు పు
రోహితుండగుటది రోతకాదె?
నినునంట మైలగునని తిట్టువాడు పు
రోహితుండగుటది రోతకాదె?
నిను సహపంక్తికి జననిచ్చు కుడుచుట
పాపంబయనియెడు బ్రాహ్మణుని పు
రోహితుఁగాఁగొన రోయకుందువె నీతి
కల్మిని బాపఁడీకార్యములను

గీ॥ సలుపునందమా! యయ్యది సాహసంబ
తనదు చుట్టాలనూఱులు తప్పులున్న
నెంచకిట్లునిను బహిష్కరించు విప్రు
డెన్న నేనీతి? నీపురోహితుండె అతఁడు?

కం॥ నీకతఁడు పురోహితుడై
చేకూర్పడె కీడు? నీకు శిక్షకుడై యెం
తో కూర్చెడుగతిగను చెడు
పోకలె ధర్మములనుచును బోధింపఁడొకో

సీ॥ బ్రాహ్మణస్థానము పాపియయ్యును నీకు
దైవంబయనుచు శాస్త్రము వచించు
నీవు క్షత్రియుడవు నీయింటగుడుచుట
కాదు తనకని పల్కంగనేర్చు
నీవు వైశ్యుడవౌట నీయింటగుడుచుట
కాదు తనకని పల్కంగనేర్చు
నీవు శూద్రుడవౌట నీయింట గుడుచుట
కాదు తనకని పల్కంగనేర్చు

గీ॥ పంచముల నెడు పేరుచే బలికి ఆరు
కోట్లజనుల దూరమ్ముగా గొట్టజేయు;
పాపబోధలచే నిను బాపి జేయు
నరయునతని పౌరోహిత్యమగును హాని

గీ॥ పదియు నెన్మిది పాపముల్ వదలి వేద
మతముబూను సద్బ్రాహ్మణుల మాన్యనీతి
కోరనీపురోహితునిగా గొనుము యద్ది
పాపముల ద్రోలి మోక్షమ్ము నొసగ జేయు

సీ॥ ఇతడు పంచముడగు నితనిని దూరము
గా బంపుమనుచు బల్కంగ జనుచు
ఇతడు శూద్రుడయగు నితనిని జూచుట
మైలని నిన్ను ను మాయ జేయు

డితడు వైశ్యుండగు నితని బాపలు విందు
సూడనీయరు కొద్ది చూలుగాన
నితడు క్షత్రియుడగు నితనిని విందులో
బాపండు చేర్పగా బాలుపడడ

సీ|| అనుచు నొరులదక్కువగాగ గనుచు తనను
నెల్లవారలు కోరిపూజింప మోక్ష
మబ్బునని బ్రాహ్మణత యొరులందవగర
అనియుఁ జెప్పిన ధర్మమ్ములతడు కొనడు

గీ|| అగుట విప్రు పౌరోహిత్యమంతరింప
జేసి సద్బ్రాహ్మణులదటిజేర్చి సర్వ
శుభములందును మఱియునశుభములందు
అతనియాజ్ఞయొంచి నడుచు టర్హమగును

(బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు అష్టాదశ మహాపాపి
యగు బ్రాహ్మణుని నీచనామము లంగీకరింపరాదు.



సీ|| శూద్రుడని పంచముడని ద్విజులునినుబిలు
వంగవాని నూకొట్టగావలవ దద్ది
నీమఘునతనుద్రించి వర్ణింపరాని
హానికావించు సత్యమ్మునణచి వైచి

గీ॥ శూద్రితయది బాల్యంబునందు నెఱుఁగుమతి
ఎల్లవారికయ్యెడుఁగాదె? ఏలనిన్ను
శూద్రిత కడచువానిని శూద్రుడంచు
బిలువ నలయునుపాపపున్ భీతిలేక?

గీ॥ దాసశబ్దంబు సేర్చిమంత్రంబులందు
నిన్ను సంబోధించునతని నిర్ణయమ్ము
పాపబద్ధ; మయ్యది యొప్పపాడిగాదు
దాసుడన నవుకరగుచు తనగు కతన

గీ॥ పంచములు లేర యిలఁగల ప్రజలయందు
అరయ సన్న్యాసులున్ గర్భమందు వెలయు
బిడ్డలున్ బంచమ దశను వెలయుచుండ్రు
రంతకంటెను బంచములనఁగఁగలరె?

గీ॥ కానఁబంచమత్వమ్మది కల్పితమ్ము
పాపఁడు తన హెచ్చుకొఱకు పాపభీతి
లేక సృష్టించె నద్ది తెలిసికొనివిడు
డట్లు యోగ్యవిప్రులఁబిల్వనగునె మనకు?

గీ॥ శూద్రులుత్తమ బ్రాహ్మణుల్ సూవె వారి
బట్టిపేరున నిత్యకృత్యములఁ బిలువఁ

దగును; శూద్రుడవా పేరది తప్పటంచు
విమనఁజెల్లును నిముసమున్ దడయరాదు

అష్టాదశ మహాపాపియగు బ్రాహ్మణుని మీ సత్రములలో అన్నదాతగా ఉంచరాదు.



క॥ నీదు సత్రమ్ము లో బాపనిం గొనకుము
అన్నదాతగ; అతని చేర్పరయఁ గొఱివి
నెత్తిపై బెట్టుకొనుటయా నిశ్చయమ్ము
ఎల్ల కీడుల మూలమై యెసగునదియు

సీ॥ పూటకు పూటకు బుష్టిగా భుజియించి
బలిసిన బాపల పిలిచి పెట్టి
నీడ లేకయు దినగూడు లేకయు బాధ
నందెడి యార్తుల నవలి కంపి
బలమెక్కి జెట్టులంబలె నొప్పు పాపులన్
బాపలు సాపాటపసుట యెల్ల
నీదు మోక్షమునకు నిలయమై చెలఁగెడు
నను దొంగముచ్చటులనుచు నెపుడొ

గీ॥ దారితప్పి వచ్చెదు నట్టివారి నేని
క్షత్రియాదుల దృష్టిదోషంబటంచు

నీంటి నెలుపల వడించి యెంతయేని
కష్టపెట్టు లనమ్మును కరుణలేక

గీ॥ ధర్మము నెఱప సత్రిమ్ము స్థాపనమ్ము
సేసి యక్కట విప్రుని జేర్చు బెల్ల
బలిసియేపాటు లేక సాపాటు సేయు
బాపల సోమరుల జేయ బాలుపడు బె!

గీ॥ బాపలను సోమరుల జేయఁ బాపమగును
కష్టపడక సత్రిమ్ములంగడుపునిండ
గుడిచికూర్చుండ జేయుచో కూలద్రోయు
దేశధనము దారిద్ర్యమ్ము తివిరి తెచ్చు

గీ॥ ఎఱిగి దానమ్ము లర్హులకీయకున్కి
పాపములయందుఁ బెద్దయు బాపమండ్రు
కానసోమరి బాపల గడుపునిండ
బెట్టుటయనర్హ దానమై వెలయుఁజూవె

గీ॥ పుణ్యములు సెందుటకు సత్రములనుగట్టి
బలిసి దిట్టలౌ బాపల బాపమనక
కుడవ జేయుట నరకమ్ముకోరి తెచ్చు
కొనుట యగుగాన నది సేయజను నెనీకు?

గీ॥ నిన్ను నీవారి రాకుండ నిల్పి సడవు
టింట పంచపాపులనేని యెట్టిఘోర
హంతకుల నేని బ్రాహ్మణులన్న పేరి
వారి జేరిచి భుజియించు బ్రాహ్మణుండు

గీ॥ అట్టి పాపులెందఱు సత్రిమందు భోజ
నము సలుపుదురో వారి పాపముల నియుధి
పతిని జుట్టుకొనుననుచు బలుకుచుందురి
నూవె ధర్మము లెటిగెదు నూరివరులు

గీ॥ కానసద్బ్రాహ్మణుండయి గౌరవమ్ము
కలిమి ఆకలిగొనువారి కులమునడుగ
క కల కొలదిగనన్నమ్ము కరుణఁబిల్చి
యొసగుసతని సత్రిమ్ములోనుంపుమరసి

గీ॥ అట్టికార్యము సేత నీకందఁజేయు
సర్వశుభములు; పుణ్యమ్ముసంతరించి
మోక్షమందగనేర్తువీ పుట్టువంద
పాపనిం జేర్పనరకంబ పాలుపడుదు

అస్థాపకే మహాపాపియగు బ్రాహ్మణునకు సంతర్పణలు సమారాధనలు చేయరాదు. మఱియు దానధర్మము లీయరాదు.



గీ॥ ఎవడు నీచూపు మైలంచు నెంచినిన్ను
దఱికి రానీక తఱిమియధర్మరీతి
పంచపాపముల్ కలలేని బంధువులను
కొని కుడుచు నతనికి విందుకూర్పనగునె?

సీ॥ సంతర్పణలటంచు సకల భోజ్యమ్ములు
తృప్తిగానిడి యెంతయేని ప్రీతి
బాపడు భుజియింప బాల్పడుఁ మోక్షంబ
టంచు కూర్పకు విందులతని గొలకు
నీడు సంతర్పణల్ నీవుచూచి ముదమ్ము
నెంచుచో మైలది సిద్ధియగు న
టంచు నిను వెలికి నంపి బాపలనుచు
హత్యలొనర్చిన యట్టివారి

గీ॥ నేడి వెలిసేయక గుడున నెగ్గు గనక
యుండు విప్రుని బూజింప నొప్పుకొనుట
ఆత్మహత్యయ కాదె? సత్యమ్ము నరసి
కుంటిగుడ్డిల దన్పఁజేకూరుఁబరము

గీ॥ దానమెవ్వరికు నొసగగా దలపబోకు
మద్దినీకు వినాశమై యలరు పదియు
నెనిమిది యఘములు విడిచి నొసగుచుండు
నట్టి సద్బ్రాహ్మణునకీయనగును మేలు

గీ॥ నిన్ననంటుచు నీచమంచెన్ని యకట!
తనకొలపుగులటల నెట్టి తప్పులేక
నేరకుడి నెను బాపని జేర్చి దాన
మిచ్చుటతగునె? పాపంబు లిడదెయద్ది?

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, అష్టాదశ
మహాపాపియగు (బ్రాహ్మణుని బిరుదములు
స్వీకరింపరాదు.



సీ॥ దేశభక్తుడవంచు తేజమ్ముమైం బిల్చు
నీవు బాపలకండ నిల్తువేని
ధర్మరక్షకయంచు దరిజేరి స్తుతియించు
నీవు బాపలకండ నిల్తువేని
సుజనపోషక యటంచును నిన్నువర్ణించు
నీవు బాపలకండ నిల్తువేని
శత్రుసంహరణ దక్షా! యంచు కీర్తించు
నీవు బాపలకండ నిల్తువేని

సీ॥ వారిఁబూజించియేని సంబరము హెచ్చి
వారి సంతర్పణలు సూడవలతు నంచు
పల్కినంత నె. అక్కట భ్రష్టుఁడవొకొ!
ఇట్టులడుగఁదగునె యను నీసడించి

గీ॥ కాన బ్రాహ్మణ బిరుదముల్ కలుషసహిత
ములవి కొనకుమ! నిన్న విప్రులకు దాసు
గాగ జేయు నెంచిన కృతుల్; కనుము సత్య;
మట్టి బిరుదమ్ము లెప్పుడు నాశఁగొనకు

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు శూద్రులనువారు తమలోఁ
గల బ్రాహ్మణత్వమును విడిచి పెట్టవలయును.



గీ॥ బ్రాహ్మణుల నిషేధమ్ములు పదియు నెనిమి
దియు నొరులెవరు నొప్పరిద్దినిజమరయ
సంస్కృతమునందొలుత పుట్టిసర్వజనుల
నవ్వివ్యాపించెద్విజుల భాష్యములవలన

సీ॥ వేదములకు దుష్టార్థముల్ విప్పిసెప్పి
వేదముచదువగా రానివిశ్వజనుల
కవియె వేదపుర సత్యమ్ములంచుఁజెప్పి
మోసమొనరించిరి ద్విజులుబుద్ధి నెఱిగి

గీ॥ వేదమెప్పుడు చదువని విననిజనులు
సత్యమంచును నమ్మియాచరణం గొనిరి
అవి యసత్యము లని యంతరాత్మ నెఱుగు
వారలుఁ లొంగిరినృపులభయము కల్మి

గీ॥ రాజశాసన శిక్షతీవ్రమయి సెలగి
వర్ణధర్మములంచును వ్యర్థములగు
పాపధర్మముల్ భువినిస్థాపనము సేయ
నెదురులేకయె వాని భరించిరకట!

గీ॥ బ్రాహ్మణత్వంబు సెందుట బాపనింట
భవము గల్గనివారికి బాపమంచు
బ్రాహ్మణులువ్రాసి దేశమ్ము భంగపఱచి
జనులసాంఘికోన్నతియు మోక్షంబు చెఱిచె

సీ॥ ప్రజలకు దెలిసిడి భాషగాకుండుట
క్షత్రియాదులు వేదసత్యమెరుగ
జాలక బాపని సత్యవంతుడయంచు
నమ్మిచిఁ విప్రధర్మమ్ము గోలు
పోయిరి; వైశ్యులుఁ భూదేవుడనుచును
మ్రొక్కుబాపడు సేయుటక్కరిన
మెఱుగగా జాలక యేదిచెప్పిన నమ్మి
రం;తియకాక రాజ్యమ్ము లేలు.

గీ॥ పనిని క్షత్రియులకు; నెల్ల ధనములట్లు
వైశ్యులకు నొసంగుట గోరవలయునట్టి
దొంతు లేకున్కి సంతుష్టి నొందియున్న
జనులహక్కులకై పోరుసలుపరైరి

గీ॥ తక్కుగల శూద్రులనువారు తమకు నైక్య
భావమును, రాజ్యము ధనము, బ్రిబలరీతి
వఱలకున్కి జయమ్ములు వడయలేక
మిన్నకుండిరి పోరెడి తెన్ను గనక

గీ॥ అట్లలోకమ్ము లెల్ల బ్రాహ్మణత ప్రాకి
క్రమముగాగ వ్యాపించి యాక్రమణ సేసె
నెఱిగి జనులు మీయందు కాన్పించునట్టి
బ్రాహ్మణత్వమ్ము నేరి తుంపంగవలయు

సీ॥ చండాలుండనెడి దుషమగు పిలుపుబిల్వ
నొప్పకు మయ్యది దప్పుపిలుపు
నాకన్య యొరుంబరిణయమాడ దప్పంచు
బల్కక శూద్రుండు పంచముడను
భేదమెంచగంబోక వేదోక్త సరణిని
పూజ్యుండొ వానికిం బుత్రినిత్తు
ననుచు నొప్పుము; చూడ, నంట దోషములగు
ననుట బాపని వైన యాంక్షలవ్వి

గీ॥ విడిచి హిందువుల్ దేవుని బిడ్డలగుట
హెచ్చుతగ్గులు లేవంచు హెచ్చరించి
ఏకజాతీయతను సృజియింప బాటు
వడగ జెల్లును భారతి బిడ్డకుకొఱకు

గీ॥ ఎన్నియో భేదములను గృశించి చచ్చు
చుండె భారతి నైక్యమ్మునొప్పి కూర్పఁ
దలపఁమేనియు నిక శాశ్వతమ్ముగాగ
బరులపల్బడి నుండు టే పాలుపడును

సీ॥ ఒకరుహెచ్చని మఱియొకరు తగ్గనుచును
పలుకుట బాపనిపాపఫలము
ఒకడుమోమునఁ బుట్టెనొకడు బాహులఁబుట్టె
నను తెల్ల బాపనియఘఫలమ్ము
ఒకడు క్షత్రియుడు వేఱొకడు వైశ్యుడటంచు
పలుకుట బాపని పాపఫలము
ఒకడు బ్రాహ్మణుడు వేఱొకడు శూద్రుడనుచు
పలుకుట బాపని పాపఫలము

గీ॥ నాల్గువర్ణమ్ము లొకడైన నరుని యందు
గల్గునంచు నీశ్వరుడు పల్కఁగనిట్లు
భేదములుచేసి వేదమ్ము భిన్నపరచి
దేశము నశింపఁజేయుట తెలివియగునె?

గీ॥ కాన బ్రాహ్మణత్వమ్ముచే కలిగినట్టి
పదియు నెన్మిది పాపముల్ వదలిమీరు
విప్రునకు సహాయ్యంబు కావింపకునికి
దలపుఁ డది ధర్మవుఁ గడు సత్యమ్మునగును

నాల్గు వర్ణముల స్త్రీలును బ్రాహ్మణ స్త్రీలు పిల్చు
పేరంటములకు, బొట్టు పిల్పులకు, విందులకు సమత్వ
ముతో చూచుటకు ఒప్పుకొనినచే పోవలయును.



గీ॥ సమతతోఁ జూచి పంక్తిభోజనము పడము
టింట నొసగ నొప్పెడిచోట్ల కేగవలయు
నాల్గుకులముల స్త్రీలు; నన్యాయరీతి
విప్రులవెనుక భుజియింప వెడలవలదు

గీ॥ మొదలబాపలు భుజియింతురు పిదప క్షత్రి
యులు భుజింతురు వెనుక వైశ్యులుభుజింతు
తుదకు శూద్రులును భుజియింపదగు నదియ
ధర్మ మనునింట గుడున నధర్మమగును

గీ॥ బాపనాండ్రలో నూఱులుపాపములు ర
చించు వారికేని మొదల పెట్టెకుడువఁ
జేసి పిదప నేపాపము సేయనట్టి
వారికింగుడుప నఘమ్ము బాలుపడదె?

గీ॥ నూఱురంకులు చేసెడివారికైన
బాపనమ్మల్ల పేరదిపరగు నేని
మొదట గుఱువంగనర్హత పోసగునెడి
బ్రాహ్మణుల ధర్మమంతయుఁ బాపమగును

గీ॥ గుణములవియె పూజ్యత్వమ్ము గొనుట కెంచ
నర్హతనోసంగు; నవివీడిజన్మవలని
భేదమరయు బాపలయిండ్ల విందుకొఱకు
పిలుచుచోఁబోవకున్కయె పేర్మినిచ్చు

గీ॥ గృహిణి నిన్ను జేరి పడమటింట నేక
పంక్తిలోఁగూరుచుండి సద్భావమలర
నెట్టిభేదమ్ములేక భుజించునేని
అట్టియిండ్లనె విందులనందవలయు

ఉ॥ కుంకుమబొట్టువెట్టుటకు గోరికఁబిల్చి ద్విజాళిలోన శం
రంకులు సేయువారికిని రమ్యతఁ గుంకుమమున్దిద్దియే
రంకులు లేనివారల కరమ్ములశూద్రులటంచు నంట కే
కుంకుమ ఎత్తివేయుటదికూడునె? బ్రాహ్మణి! నీకుధర్మమే?

గీ॥ పూజ్యరాండ్రఁ బిలిచివారి మొగములందు
బొట్టునుంచుచో నంటనిమ్ముట్టుకొనక

తురకలంగూడ కొలిగి కూతురనిబొట్టు
పెట్టుటది వేదధర్మమె వెలయునొక్కొ?

ఆ॥ అంటుకొన బాపమానను నట్టివారి
బిల్వభోక్తుగుంకుమమిడ పిల్చినొవ్వం
జేయుదే? బ్రాహ్మణీ! యిట్టి సేద్విజుడు
సెప్పనేవియు నీకురచింపదగునె?

గీ॥ రంకులెన్నియొ సేసెడి బ్రాహ్మణులకు
నేని యింటిభోజనమిడి యెన్నో పుణ్య
ము లొనరించు శూద్రులకును భోజనమ్ము
వెగటవడ్డింప గోరునే వేదమకట?

గీ॥ నాల్గువర్ణమ్ములవి యొక్క-నారియంద
యుండుననుచును వేదమ్ములొప్పి సెప్పం
గాన భేదమ్ములెంచక గరితలెల్ల
ఈశురూపుల యంచు పూజింపరమ్మ!

సీ॥ బాపండు నీదగు బ్రహ్మవిద్య హరించె
బ్రాహ్మణత్వమ్మును బడయరాద
యంచును మోసంబు నాచరించె; నదియె
యుంగు; మట్లు పరుల అంగనలను
బ్రాహ్మణ్యము సెందనలవద యంచును
విధియించి చేటుకావించె నకట!

బాపడాతడు సేయుబాములచే కీడు
సెందినయట్టి నీ చెలులు రాగ
గీ॥ ఇంటివెలుపల వడ్డింప నెంచబోకు
మది మహాపాపమట్టి కార్యమ్మునీకు
ఇహము పరము లేకుండనశింపఁజేయు
గానసహపంక్తిని గుడిపి గారవించు

బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులు, శూద్రులనువారు సద్బ్రాహ్మణుని పౌరోహిత్యము అర్చకత్వము మొదలగునవి స్వీకరింపవలయును.



గీ॥ వేదశాస్త్రంబులంగల విమల సత్య
ముల తెరలు తొలగించి నేర్పున నెఱింగి
పదియునెన్మిది పాపముల్ పారద్రోలు
నట్టి సద్బ్రాహ్మణుం గొల్వనగునునీకు
గీ॥ అట్టివానికి మ్రొక్కుమభ్యంతరమ్ము
సెప్పకయె సత్యపరుడు నీక్షేమమరయు
వాడు హెచ్చు తగ్గులులేని భవ్యమూర్తి
వేదవిదుఁడు ధర్మమ్ము కావించువాడు
గీ॥ బ్రాహ్మణత్వంబు సెందగావలవదంచు
బాపలు ప్రజల మోక్షమపహరణమ్ము

సేయు నెల్లజనుల మోక్షసిద్ధికోఁ జకు
దాని నొసఁగు సద్విప్రుఁడు ధన్యుఁడగుచు

గీ॥ వేదములు పఠించుట ధర్మభిన్నమనుచు
ద్విజులు కానివారి ద్విజులు వెలివెట్ట
వేదముల్ చదువుట వేదవిధియటంచు
ప్రజలకాతఁడు వేదపఠన మొసఁగు

గీ॥ తపముసేయుచో బ్రాహ్మణేతరులు నరక
మందుదురనుచు బ్రాహ్మణుఁ డడ్డుదగుల
తపముసేయుటె యెల్లర ధర్మమనుచు
యుర్వి ప్రజలకెల్లఁ దపమునొసగునతఁడు

గీ॥ అర్చకత్వంబు బాపలే యందవలయు
నంచు విప్రులు బోధింప నాతఁడర్హు
లయిన పంచముల్ శూద్రులు నద్దిపొంద
దగునటంచు వచించును ధర్మియగుచు

గీ॥ గర్భగుడిని స్వయంపూజ కావలయున
నఁగదగదు శూద్రులనెడు జనములు నవల
బంచములు ననుచు ద్విజుడు పలుక; నద్ది
నెల్లరికి దగునని వచియించునతడు

గీ॥ ప్రథమమగు మ్రొక్కునెల్లరు బ్రాహ్మణునకె
ఈయనగునని ద్విజుడు వచింప; నద్ది
పంచముడ యేని ధర్మమై పడయందగున
ది ద్విజుల నుండి ఘనమనుచు విధించు నతడు

గీ॥ శూద్రుడును పంచముండు దాసుండను నెడు
పేర్లు నెట్టి జనమ్ములఁ బిలుచు ద్విజుడు
అట్టిపేరులు పాపంబులనుచుఁ జెప్పి
యెల్లరిని సములుగ గణియించునతడు.

గీ॥ చూచినంతన పాపమ్ము చుట్టుకొనును న
టంచు విందు వెలికిబంపు నఖిలజనుల
బ్రాహ్మణుం; డది సద్విప్రుడు పాపమనుచు
ఎల్లరంజూడ నంగీకరించుచుండు

గీ॥ అంటగారాదటంచు బ్రాహ్మణుడు బ్రాహ్మ
ణేతరుల నిషేధించు నెన్నేనిగతుల
అరసి శుచిగల యెల్లర నడ్డులేక
అర్హులనుచు సద్బ్రాహ్మణుం డంటుకొనును

గీ॥ సరసఁ జేరి బాపల పరిషత్తులందు
పంచముల్ శూద్రులనువారు పలుక సాహ
సించుట యఘమటంచు వచించు బ్రాహ్మ
ణుండు; దానిగాదను సువిప్రుండు తెలిసి

గీ॥ క్షత్రియులు వైశ్య శూద్రపంచములు తనదు
పఙ్త్తిని భుజింపఁదగరని పల్కుద్విజుఁడు
క్షత్రియులు, వైశ్య శూద్ర పంచములు తనదు
పంక్తిఁగుడువ నొప్పుననుచు సద్బ్రాహ్మణుండు

గీ॥ క్షత్రియులు వైశ్య శూద్రపంచములు తనదు
నూతిఁ బెట్టాఁడదగరని నుడువు ద్విజుఁడు
క్షత్రియులు వైశ్యశూద్ర పంచములు తనదు
నూతిఁ బెట్టాఁడనౌనను సూక్ష్మమతుఁడు

గీ॥ పురుషులకుఁగల స్వాతంత్ర్యములను స్త్రీల
కీయరాదటంచును వచియించు ద్విజుఁడు
పురుషున్నొ హక్కులు స్త్రీలకీయఁదగున
యంచు సద్బ్రాహ్మణుండు వచించుఁదెలిసి

గీ॥ ధర్మనిర్ణయమును విప్రధర్మమౌని
యుంట ద్విజులకె తగునని చెప్పుద్విజుఁడు
ఎల్లరికిని విప్రులగుట ఎఱిగితీర్పు
ట తగునని సువిప్రుఁడు పల్కు శ్రుతులెఱింగి

గీ॥ రాజ్యమేలుట యోధుఁడై కాఁపుచుంట
క్షత్రియులకె తగునను ద్విజన్ముఁడకట!
రాజ్యమేలుట యోధుఁడై రక్షసేత
ఎల్లరికి నౌనను సువిప్రుఁడెఱిగి శ్రుతులు

గీ॥ భూమిదున్నుటయును మొదవులఁ బెనుచుట
వర్తకమును వైశ్యుల కీయవలయుననును

ద్విజుఁడు; సర్వజనములు భుక్తి కొఱకవ్వి
పూననగుననుచును సువిప్రుడు వచించు

గీ॥ శూద్రుడు ద్విజుల వృత్తులు సోకరాద
టంచు బల్కు బ్రాహ్మణుడు సత్యమ్ము విడిచి
నాల్గువర్ణమ్ము లొకఁడయొనర్చు మోక్ష
పుం దెరువులనిపల్కు.. సద్బ్రాహ్మణుండు

గీ॥ పంచములను బాపపు పేరు వల్కు ఆరు
కోట్లజనులను వెలివేయఁగోరు ద్విజుడు
యోగ్యవిప్రులు వారంచు నొప్పదెలిపి
పూజ్యులనుచు జెప్పును సువిప్రుండు చదివి

గీ॥ యజ్ఞములటంచు మేకలహత్యసేసి
బ్రాహ్మణుడు మాంసము భుజించుఁ బాపమనక
యజ్ఞములను సద్బ్రాహ్మణు డజముజంప
కాత్మ నీశునికిచ్చుటె యజ్ఞమనును

గీ॥ తైత్తిరీయమ్ము నెల్ల నర్థమ్ముతోడ
మొదలునుండి తుదివఱకు చదివి యెపుడు
ఈశుగొల్చుచు సద్విప్రుఁ డెసగుభక్తి
అర్థమెఱుగక చదువు బ్రాహ్మణుడు దాని

గీ॥ స్వరము స్వరమంచు బాపడు చదువు శ్రుతులు
అట్లసంధ్యార్చలును కలయర్థ మెఱుగ
కయ సలుపును; సద్విప్రుండొ! కలుగు నర్థ
మెఱిగిచదువు; సేయును కర్మలెల్ల నట్ల

గీ॥ వత్సరమ్మునదొంబది వాసరముల
నేని నూలుసద్విప్రుండు వూనివడకు
యజనయాజనాదికములొనట్టి కర్మ
లారునుం జేయు ధర్మమై అర్ధమెఱిగి

గీ॥ మాంసమంటఁడ గుడ్లను మత్స్యములను
గుడవనొల్లడు నిష్ఠమై విడువకద్ది
వ్రతముగా యజ్ఞమందేని వ్రతము సడక
యుండు సద్బ్రాహ్మణుడు మోక్షమొందఁగోరి

గీ॥ తాను బాపియయ్యు తనమంత్రింబుకల్మి
నీశుబంధింతునని వచియించుద్విజుడు
తానుపుణ్యమూర్తియయినఁ దప్ప మంత్రి
మీశుఁగట్టఁజాలదని వచించునతడు

గీ॥ తనదు మంత్రమ్ము ప్రోక్షణ దైవమును బ
వితృ జేయుననునఘము ద్విజుడు పలుకు
మంత్రమును ప్రోక్షణయును ధర్మంబు సేఁత
మనుజులఁ బవితృల నొనర్చునను ద్విజుండు

గీ॥ దైవమేనియు తనదు మంత్రింబునంద
తవిలియుండుననియుఁ దాన దైవమునకు
దైవమంచుఁ జెప్పు ద్విజుడు; దేవునకగు
ద్రోహమదియంచు సద్బ్రాహ్మసురుండు పలుకు

సీ॥ ఇతనుపంచముడంచు నీసడించియతని
పడమటింట భుజింపఁదడయఁబో...

ఇతఁడు పంచముఁడంచునీసడించి తనదు
పడమటింట కుడుపఁ బాపఁమనఁడు
ఆల్లశూద్రులయిండ్ల నైనవర్ణేతరు
లను జనములయిండ్లనైన భేద
మరయక శుచిగల్గు నందఱియిండ్లను
గుడుచును; తనయింటగుడువఁ జేయు

గీ॥ బాపనిపని యునెన్మిది పాపములను
విడిచి వేదమందలి సత్యవిధమెఱింగి
సత్యవంతుఁడు ధర్మమ్ముసలుపువాఁడు
నగుచు సద్బ్రాహ్మణుఁడు లోకమాశ్రయించు

గీ॥ గుణముకలయట్టి పూజ్యగన్గొన్ననతఁడు
పంచముఁడని మ్లేచ్ఛుఁడనుచు నెంచకయున
మస్కృతులు సేసియతని క్షేమమ్మునరయు
చిన్న కేనియు మ్రొక్కరచించు నరసి

గీ॥ అట్టిసద్బ్రాహ్మణుంగాని యన్ని మంచి
కర్మలు నశుభములయిన కర్మలురచి
యింపఁజేసికొని పరమునిహముఁబొంద
నరయుఁడయ్య భారతపుత్రులార! మీరు



సంపూర్ణము.



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA107B154 |
| పుస్తకం పేరు | ఆంధ్ర మహాయోగినుల చరిత్రము |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 159 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | ,B, D |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ch. Ramya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |